

Surya's

# వాస్తు సైన్సా? కాదా?

## ఆస్తికులకు, నాస్తికులకు సమాధానం


**కప్పగన్తు సుబ్బరామ సోమయాజులు**

శ్రీ లక్ష్మీనృసింహ జ్యోతిషాలయం
కామకోటినగర్, నృసింహకృప బిల్డింగ్,
1-4/4-16/1, శంకరమఠం వీధి, విజయవాడ.
ఫోన్ : 0866-2414336 సెల్ : 9848520336



Surya BOOKS

SURYA'S



# వాస్తు సైన్సా? కాదా ?

First Edition : 2007



Price : Rs.20-00

SOLE DISTRIBUTORS
SRI VENKATESWARA BOOK DEPOT
Singarajuvari St., Kothapet, Vijayawada - 1.
Ph : (0866) 6663733, 2565038.
★ ★ ★
SRI VENKATESWARA BOOK DEPOT
Plot No.3, 103, # 2-4-1085,
Sai Lakshmi Niketan,
Opp. Street of Ramakrishna Hospital,
Near Kachiguda Kumar Theatre,
Nimboli Adda, Hyderabad - 500 027.
Ph : (040) 65528228, Fax : 24745257.

Publishers :
**Victory Publishers**
**Regd. Off :** # 11-16-32(a), Singarajuvari St.,
Kothapet, VIJAYAWADA - 1. Ph : 6663733
**Admn. Off :** # 29-28-40,
Dasarivari St., Suryaraopet,
VIJAYAWADA - 2. Ph : 6613734, 6613735





## ముందుమాట

దయచేసి ఈ పుస్తకము మొత్తం చదవగలిగితేనే పుస్తక పఠనం ప్రారంభం చేయండి. లేని ఎడల పుస్తకం చదువవద్దు. నిర్మాణాల కోసం ఏర్పడిన నియమాల మాలిక వాస్తు శాస్త్రం. ప్రాచీనులు, మహర్షులు వాస్తు శాస్త్రమును అన్ని కాలములలోని వారు సమానముగా వాడుకునే విధానంగా తయారు చేశారు. గదులు, ద్వారములు అమరిక ఇలా చేసుకోమని చెప్పారు. ఇలా చేసుకోక పోతే నష్టం వస్తుందని చెప్పలేదు. ఉదాహరణకు ఆగ్నేయంలో వంట పెట్టమని, ఆగ్నేయంలో వంట పెట్టే అవకాశం లేకపోతే నైఋతి, ఈశాన్య గదులు కూడా వాడుకోమని చెప్పారు. ఆగ్నేయంలో పెట్టకపోతే ఏమౌ తుంది? అనే విషయాన్ని సూచించలేదు. అందుకే దానిని ప్రాచీన వాస్తు అంటాము. ఆధునికులు కొందరు ఈ ఫలితాలు మాత్రమే వ్రాశారు. దీనికే ఆధునిక వాస్తు అని పేరు. నా ఉద్దేశ్యం ప్రకారం 20వ శతాబ్దంలో ఈ ఫలిత రచన (ఆధునిక వాస్తు) జరిగిందని నా అభిప్రాయం. మీడియాలో ఈ మధ్యన జరిగిన చర్చ ప్రాచీన వాస్తు శాస్త్రం తెలియని వారికి, సైన్స్ అంటే తెలియని వారికి జరిగిన చర్చ మాత్రమే. ఈమాట అంటున్నందుకు క్షమించాలి. సైన్స్ గురించి పూర్తిగా తెలిసినా, ప్రాచీన వాస్తుగురించి పూర్తిగా తెలిసినా ఈ పుస్తకంతో పనిలేదు.

భవదీయుడు
**కప్పగన్తు సుబ్బరామ సోమయాజులు**

# విషయ సూచిక









శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః

# భారతీయత

ప్రాచీనులు చెప్పిన విషయాలన్నీ సైన్సా అని ఆలోచిస్తే మనకు చికాకులే మిగులుతాయి. వారు ఏ విషయాన్ని అయినా ఆలోచించి చెప్పారు. మనం కూడా నేటి సమాజంలో సైన్స్ కానిది, ప్రమాద భూయిష్టమైనది ఒక విషయం నిత్యంలో అమలు చేస్తున్నాము. అవే ట్రాఫిక్ రూల్స్. వాటిని కూడా చర్చిద్దాం. ప్రాచీనులు బట్టలు కట్టుకోవడం చెప్పారు. అది సైన్స్ కాదు. మరి దానిని ఎందుకు అమలు చేస్తున్నాం? సమాజం కోసం. అయితే సమాజం కోసం ప్రారంభమైన వస్త్రధారణ వాతావరణం నుండి పరిరక్షించుకోవడం కోసం మరియు మన గొప్పదనం ప్రదర్శించుకోవడం వంటి వాటిదాకా వెళ్లింది. మరి ఈ వస్త్రధారణ సైన్సా? కాదా?

చలికాలంలో, చలి ప్రాంతంలో ఉన్ని దుస్తులు కట్టుకోవడం అనేది సైన్టిఫిక్ రీజనే. ఉన్ని దుస్తులు కట్టుకోకుండా కూడా బతుకుతున్న వారూ ఉన్నారు. వారిని చూసి ఉన్ని దుస్తులు కట్టుకోవడం అనే విషయం మీద ప్రసంగం ప్రారంభం చేస్తే అనవసర ప్రసంగంలా ఉంటుంది. భారతీయ సంస్కృతిలో మన నడవడికి సంబంధించి ప్రతీ విషయాన్ని ఒక్కో శాస్త్రంలా చెప్పారు. ఇదే రీతిలో సమాజంలో ఉన్న అటాచ్‌మెంట్స్ (అనుబంధాలు) ద్వారా వచ్చే బాధలు అనగా అనుబంధ విషయంలో ఏర్పడే ప్రతికూలత వల్ల వచ్చే మానసిక ఇబ్బందులను దృష్టిలో ఉంచుకుని మనో నిగ్రహం కోసం మనవారు వేదాంతం, యోగాభ్యాసం, మెడిటేషన్ వంటివి చెప్పారు. ఇవన్నీ సైన్సా అంటే కాదు. కానీ వాటిని అనుభవిస్తే ఆనందం లభిస్తుంది. ఇప్పుడు ట్రాఫిక్స్ రూల్స్ సైన్సా కాదా అని చర్చిద్దాం.

ఒక నియమ నిబంధనలతో కూడిన ప్రయాణ విషయాల సమూహమే ట్రాఫిక్ రూల్స్. ఇది సైన్సా అని ప్రశ్నిస్తే యాక్సిడెంట్ అయ్యాక గానీ సమాధానం దొరకదు. ఇది డివైడర్‌తో కూడిన రోడ్డు. (పక్కన పటంలో ఉంది) ఉదాహరణకు పై పటంలో ఎ నుండి బి దాకా వెళ్లేందుకు సి నుండి డి దాకా వచ్చేందుకు ఒక రోడ్డును డివైడర్‌తో రెండుగా చేసి ప్రయాణ అనుకూలం కోసం మార్చారు. అయితే ఎవడో మూర్ఖుడు ప్రయాణ రద్దీలేని సమయంలో బి నుండి ఎ దాకా వ్యతిరేక దిశలో ప్రయాణించాడు. వాడి అదృష్టం బాగుండి ఏమీ ఇబ్బంది కలగకుండా

ప్రయాణం పూర్తి చేశాడు. వాడు మరో పదిమందిని ప్రోత్సహించి, బి నుండి ఎ దాకా ప్రయాణం చేశాడు. ఆ పదిమంది వాడి మాటలను బట్టి బి నుండి ఎ వరకు ప్రయాణం చేశారనుకోండి... అదే సమయంలో ట్రాఫిక్ రూల్స్ ప్రకారం ఎ నుండి బి వరకు ప్రయాణం చేసే వ్యక్తులకు ఆ ఎదురుకుండా వచ్చేవారి ద్వారా ఇబ్బందులు కలిగి, రోడ్డంతా కూడా ట్రాఫిక్ జామ్ అయ్యే అవకాశం ఉంటుంది. ప్రయాణీకుల రక్షణ కూడా కొరవడే అవకాశం ఉంటుంది. అందుకోసమే కొన్ని నియమాలతో ఈ యొక్క ట్రాఫిక్ రూల్స్ ఏర్పాటు చేశారు. ఇది సైన్సా అని అడగడం కంటే వాటిని పాటిస్తే మనకు, మన తోటి వారికి అందరికీ కూడా సుఖవంతమైన ప్రయాణం లభిస్తుంది. ప్రపంచంలోని అన్ని విషయాలు సైన్స్‌తో ముడిపడి ఉండవు. అనుభవించే విషయంలో ఇబ్బందులు తెలిశాక వాటి యొక్క గొప్పదనం బైట పడుతుంది.




నేను కూడా వాస్తు సైన్సు అనడం లేదు. ప్రాచీనులు కూడా వాస్తును సైన్సుగా చెప్పలేదు. ఏదైనా శాస్త్రాన్ని పరిశోధించేటప్పుడు ఈ శాస్త్రం ఎందుకు ఉత్పత్తి అయినది? ఆనాటి సామాజిక స్థితి ఏమిటి? దానిలో ఎలాంటి మార్పులు వచ్చాయి? దాని వినియోగం ఎంత వరకు అవసరం అని తెలుసుకుంటే ఈ చికాకులు మనకు రావు.

ఒక్కసారి వైద్యశాస్త్రం గురించి ఆలోచించండి. ఆరోగ్యంగా ఉన్న వ్యక్తికి వైద్యం ఎందుకు? అనారోగ్యం వచ్చినప్పుడే అతనికి వైద్యం అవసరం. ప్రాచీన కాలంలో వారికి లభ్యమయ్యే ఆకుపసరుల వంటి వాటితో ప్రారంభమయ్యి, వైద్యం తరువాత మూలికలు, వాటి సంయోగాలతో 'ఆయుర్వేదం' అనే రూపాంతరంతో, వైద్య సదుపాయం పెరిగింది. మనం పొందిన ప్రయాణ సౌకర్యాలు, ఇతర దేశాలతో సంబంధాలు, తద్వారా సైన్స్ అభివృద్ధి, ఈ దృష్ట్యా నేడు మనం ఇంగ్లీషు వైద్యం, హోమియో వైద్యం వంటివాటిని చూస్తున్నాం. అలాగని పూర్వపు





పసరు వైద్యాన్ని 'ఇది సైన్సా?' అంటే చాలా తప్పు అవుతుంది. ఇంకా కొన్ని రోగాలకు పూర్తి ఉపశమన విధానాన్ని కనుక్కోలేని స్థితిలో ఉన్న వైద్య శాస్త్రాన్ని చూసి వైద్యశాస్త్రం సైన్స్ కాదు అంటే కూడా తప్పు అవుతుంది.

వాస్తు సైన్స్ అని నమ్మేవారి కంటే నమ్మని వారే దీని గురించి ఎక్కువగా జపిస్తున్నారు. అయితే వాస్తు సైన్స్ అయినా, కాకపోయినా దీనిని గురించి ఎక్కువగా చర్చలు సాగించి, 'ప్రజల మనోభావాన్ని చైతన్యం చేస్తున్నాం' అనే అపోహలో ఎక్కువ సమయం అనవసర కాలక్షేపాలతో వృధా చేస్తున్నారు. మరి మీరు ఇలా అనవసర కాలక్షేపాలతో జనాలకు అందించే విజ్ఞానం ఏమిటి? అనేది నాకు అర్థం కాలేదు. మీరు ఇది సైన్స్ కాదు అనుకున్నప్పుడు మిగిలిన సైన్స్ విషయాల గురించి ప్రజలను విజ్ఞాన వంతులను చేయడం కోసం ఎంత సమయం వాడుకున్నా నష్టం లేదు. కానీ వాస్తు సైన్స్ కాదు అని చూపడం కోసం ఎంత సమయం వృధా చేస్తున్నారో అర్థం అవుతోందా. ఇది కూడా ప్రజలను, అమాయకులను తప్పుదోవ పట్టించడమే. వాస్తు శాస్త్రం పుట్టిన నాటికి ప్రజలలో అధికశాతం విజ్ఞాన వంతులు, విద్యావంతులు కాకపోవచ్చు. కానీ గృహ నిర్మాణం అందరికీ అవసరమైనదే. వారి వారి అవకాశం, శక్తిని దృష్టిలో ఉంచుకుని వారికి తగిన రీతిలో గృహ నిర్మాణం చేయడం కోసం ఏర్పాటు చేసిన శాస్త్రమే ఈ వాస్తు శాస్త్రము.

## దేవుడు లేడు అనుటను ప్రభుత్వ వ్యతిరేక చర్యగా పరిగణించాలి

**(ప్రస్తుత ప్రభుత్వ ఆర్థిక స్థితిని బట్టి)**

భక్తితో దేవుడు కోసం ప్రయత్నిస్తాం. తద్వారా దేవాలయాలు ఉత్పత్తి అవుతున్నాయి. భక్తితోనే ధర్మం ప్రారంభమవుతుంది. భక్తికి రూపం ఏదైనా కావచ్చు. మంచి కార్యములు, ధర్మకార్యములు చేసేవారికి కూడా ఆ కార్యముల మీద భక్తి ఉన్నట్టే. దేవుడు, ధర్మము ఉన్నాయి కాబట్టే దేవాదాయ, ధర్మాదాయ శాఖ ప్రభుత్వంలో ఉద్భవించింది. దానికి ఒక మంత్రి, ఐ.ఎ.ఎస్. ఆఫీసర్లు, ఐ.పి.ఎస్. ఆఫీసర్లు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు, సూపరింటెండెంట్లు, గుమస్తాలు, ఇలా లక్షల జనాభా దేవాదాయ శాఖ

మీద ఆధారపడి జీవనం చేస్తున్నారు. దేవాలయాల మీద ఆధారపడి ఎందరో వ్యాపారస్తులు జీవనం చేస్తున్నారు. దేవుడే లేకపోతే దేవాదాయ శాఖ ఎక్కడనుండి వస్తుంది? మీకు గుర్తుందా? కాంగ్రెస్ ప్రభుత్వం రాగానే మంత్రి ఎమ్మెస్సార్ గారు అప్పట్లో దేవాదాయ శాఖ గురించి గొప్పగా స్టేట్‌మెంట్ ఇచ్చారు. దేవాదాయ ధర్మాదాయ శాఖ ప్రభుత్వానికి ఒక ఆధారం కూడా అయింది. దేవుడు లేకపోతే దేవాలయాలు లేవు, తద్వారా దేవాదాయ శాఖ లేదు. మంత్రి గారూ ఉండరు. అందువల్ల నిరుద్యోగ సమస్య, రెవిన్యూ సమస్యల్లు ఎక్కువగా ఉన్న నేటి కాలంలో దేవుడు లేడు అనేటటువంటి ప్రసంగాలకు ప్రజలు లొంగి దేవాలయాలకు వెళ్లడం మానివేస్తే దేవాదాయ శాఖ ఆదాయం తగ్గి, ప్రభుత్వానికి ఇబ్బంది కలుగదా? ఆ శాఖలో పనిలేనప్పుడు ఉద్యోగుల స్థితి ఏమిటి? మరి మంత్రిగారి పరిస్థితి ఏమిటి? దేవుడు లేడు అని చేసే ప్రచారం ప్రభుత్వ వ్యతిరేక ప్రచారమే అవుతుంది. నేను చెప్పింది నిజమో కాదో మీరే బాగా ఆలోచించండి. ప్రభుత్వం ఈ ఉపన్యాసాలను ప్రభుత్వ వ్యతిరేక చర్యగా పరిగణించాలి. ప్రపంచం మొత్తంలో ఏదో ఒక మత దేవాలయం ఉంటూనే ఉంటుంది. ప్రతి ఊర్లోను, గ్రామంలోను హిందూ దేవాలయం కావచ్చు, ముస్లిం దేవాలయం కావచ్చు లేదా క్రైస్తవ దేవాలయం కావచ్చు. ఈ పిచ్చివాళ్ల మాటలు విని, దేవాలయాలకు ప్రజలు వెళ్లడం మానరు. హిరణ్యకశిపుడు, కంసుడు వంటివారు శత్రువుగా చూసిన విష్ణువును ఎక్కువగా తలచుకుంటూ ఉండేవారు. అలాగే దేవుడు లేడు అనేవాదనలో ఉన్నవారు భక్తుల కంటే ఎక్కువగా దేవుడు గురించి చర్చ చేస్తున్నారు. ఇదే రీతిలో వాస్తు శాస్త్రం ఉంది అని నమ్మేవారి కంటే నమ్మని వారే ఎక్కువగా చర్చలు చేస్తున్నారు.

## వాస్తు సైన్సా? కాదా?

నివాస యోగ్యమైన గృహ నిర్మాణం చేసుకోవడం కోసం ఏర్పాటు చేసిన శాస్త్రమే వాస్తు శాస్త్రం. ఏదైనా విషయం గూర్చి పూర్తిగా తెలియని వారు, ఏదైనా విషయం గూర్చి పూర్తిగా సంబంధం లేనివారు ఆ విషయం





గురించి చర్చించుకుంటూ ఉంటే ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో ఇప్పుడు ఈ చర్చకూడా అదేరీతిగా ఉన్నది. ఒక శాస్త్రం గురించి చర్చించుకునే సందర్భంగా ఆ శాస్త్రం ఎందుకు ఉద్భవించింది? శాస్త్రం యొక్క ఉద్భవ సమయానికి ఉన్న కాలమాన స్థితులు ఏమిటి? శాస్త్రములోని అంతర్యం ఏమిటి? శాస్త్రంలో కాలక్రమంలో వచ్చిన మార్పులు ఏమిటి? అని ఆలోచిస్తే ఈ వాస్తు శాస్త్రము గురించి చర్చా కార్యక్రమము యొక్క అవసరం ఉండదు. సైన్స్ అంటే ఒకే నిర్వచనం, ఒకే సూత్రం కలిగి ఉంటుంది. ఈ పని ఇలా చేస్తేనే ఆ ఫలితం అలా వస్తుంది. అని ఒకేమాట, ఒకే ఫలితం తెలిపేది సైన్స్. ఉదాహరణకు నీరు రసాయనక నామం $H_2O$ రెండు హైడ్రోజన్‌లు, ఒక ఆక్సిజన్ కలిస్తేనే నీరు అవుతుంది. హైడ్రోజన్ తగ్గినా, పెరిగినా, ఆక్సిజన్ తగ్గినా, పెరిగినా నీరు అవదు. దాని రూపం మారుతుంది. ఉదాహరణకు ఆక్సిజన్ పెంచామనుకోండి $H_2O_2$ అవుతుంది. అప్పుడు హైడ్రోజన్ పెరాక్సైడ్ అంటారు. సైన్స్ అంటే నా ఉద్దేశ్యం ప్రకారం A SYSTEMATIC STUDY OF ANY KNOWLEDGE IS CALLED SCIENCE.

ఒకే అంశాన్ని గూర్చి రెండు మూడు అవకాశములు సైన్స్ ఇవ్వదు అనే విషయాన్ని తెలుసుకోవాలి. ఈ సైన్స్ అనే నిర్వచనం గురించి పూర్తిగా తెలిసినపుడు మన ప్రాచీన వాస్తు శాస్త్రం గురించి పూర్తిగా తెలిసినపుడు వాస్తు సైన్సా? కాదా? అనే చర్చకు అవకాశం ఉండదు. వాస్తును సైంటిఫిక్ రీజన్స్‌తో కూడుకుని చెప్పారా? లేదా అనే అవసరం కూడా రాదు. వాస్తు శాస్త్రం గురించి తెలుసుకునేటప్పుడు సివిల్ ఇంజనీరింగ్ కూడా సైన్సా? కాదా? అని కూడా ఆలోచించండి. సివిల్ ఇంజనీరింగ్ ఆధారంతో మనవారు చిన్న గుండుసూది నుండి వంతెనలు, వారధులు, ఆకాశ హర్మ్యాలు వంటివి అన్నీ నిర్మాణం చేసారు. ఒక సివిల్ ఇంజనీర్ అనేవాడు లేకుండా మన ప్రాచీనులు వారికి తగిన నిర్మాణాలు అన్నీ వారు చేసుకుంటూ వచ్చారు. ఒక్కసారి చరిత్ర బాగా పరిశీలించండి. ఎన్నో విశేషమైన నిర్మాణాలు చాలా కాలం క్రితమే జరిగాయి. వాటి నిర్మాణానికి సివిల్ ఇంజనీర్ అనే వ్యక్తి లేడు.

ప్రపంచంలోని అన్ని ముఖ్యకట్టడాలు సివిల్ ఇంజనీర్లు ఉండే జరిగాయా? సివిల్ ఇంజనీర్ అనేవాడు నీటి సదుపాయం కోసం బోరింగ్‌లేదా బావి ఏర్పాటు చేస్తాడు. మన పూర్వులు కూడా అటువంటి నిర్మాణాలు చేసారు. మనం ఈ మధ్యకాలంలోనే ఈనాడు ఆదివారం సంచికలో విజయ నగరం నిర్మాణం చూశాము. అవి ఏ సివిల్ ఇంజనీర్ కట్టాడు. మన ఎదురుగా ఉన్న తంజావూరు బృహదీశ్వర ఆలయం, తాజ్‌మహల్, మైసూర్ ప్యాలెస్ వంటి వాటిని ఏ సివిల్ ఇంజనీర్ కట్టాడు? ఒకసారి పాఠకులు విజ్ఞతతో ఆలోచించండి. సివిల్ ఇంజనీరింగ్ అనేది నేటి విద్యావిధానాల దృష్ట్యా సైన్స్ విభాగాల్లో చేర్చినప్పుడు పూర్వపు కట్టుబడుల కోసం ఉపయోగించిన ఇంజనీరింగ్ కాన్సెప్ట్ – వాస్తు శాస్త్రము. అది మరి ఎందుకు సైన్స్ కాదు? మీ మనసులోని సందేహము నేనే చెబుతాను. దానికి సమాధానం నేనే చెబుతాను వినండి.

## మీ సందేహం

ఇది ఇలా కడితే ఈ ఫలితం వస్తుంది. ఇది ఇలా కట్టకపోతే ఈ ఫలితం వస్తుంది అనే విషయం సివిల్ ఇంజనీరింగ్ చెప్పలేదు. వాస్తు శాస్త్రము మాత్రమే చెప్పినది. ఆ చెప్పిన ఫలితాలన్నీ నిజమేనా? ఇది మీ యొక్క అసలు సందేహం. మీకు కావలసింది ఏమిటి అంటే ఇలా నిర్మాణం చేస్తే ఈ ఫలితం వస్తుంది. వందశాతం అందరికీ ఇదే వర్తిస్తుంది అనేది మీకు నిరూపించాలి. అంతే కదా...

నిర్మాణం చేసే విషయం వరకు సివిల్ ఇంజనీరింగ్, వాస్తు శాస్త్రము రెండూ ఒకటేనని మీరు ఒప్పుకోండి. ఫలిత విషయాలకు వాస్తు శాస్త్రం అతిశయోక్తిగా కనబడుతోంది. కట్టుబడి విషయంలో వాస్తు శాస్త్రం వాడుకునే పూర్వులు నిర్మాణాలు చేసారు అనడానికి మనకు ఎదురుగా కనబడుతున్న దేవాలయాలు, రాజభవనాలు ఇవే ఉదాహరణగా మిలిగినాయి. వాటి యొక్క నిర్మాణ విషయం విశ్వకర్మ, మయవాస్తులలో చూపిన విధంగా అదే సూత్రాల ఆధారంగా నిర్మాణాలు జరిగినాయి. కాబట్టి ప్రాచీనులు సివిల్ ఇంజనీరింగ్ కోసమే వాస్తు శాస్త్రాన్ని వాడుకున్నారు అనే వాదనను మీరు ఒప్పుకోక పోతే మీరూ మూర్ఖులుగానే





పరిగణింపబడతారు. కారణం ఎదురుగా మనకి సాక్ష్యాలుగా ప్రాచీన కట్టడాలు కనబడుతున్నాయి కాబట్టి.

వాస్తు శాస్త్రం పూర్తిగా గ్రామ, నగర, పట్టణ రచనా నిర్మాణాలను దృష్టిలో ఉంచుకుని చేసినవే. ఒక మనిషి నివాసాన్ని మాత్రం దృష్టిలో ఉంచుకుని చేయలేదు. ఈ విషయాన్ని మీకు నేను ప్రతిచోట, ప్రతి అంశంలోనే స్పృశిస్తాను. ఏమిటి ఈయన పుస్తకం సైజు పెంచడం కోసం ఈ వాక్యాన్ని ప్రతి చోటా వ్రాసాడా? అనే అనుకోవద్దు సుమా! నగర, గ్రామ రచనల దృష్ట్యా వాస్తు శాస్త్రం సృష్టించినట్లుగా మయమతం, విశ్వకర్మ వాస్తు తెలియజేస్తున్నాయి. అంతే కాదు పురావస్తు శాఖ అప్పుడప్పుడు హరప్ప, మొహంజుదారో వాటి నుంచి సంవత్సరం క్రితం వరకు నాసా వారు OK చేసిన ద్వారకా నగరం వరకు కూడా అన్ని చాలా సిస్టమాటిక్‌గా నిర్మాణం అయినట్లు తెలియజేశారు. మీకు ఈ విషయాలు కావాలంటే పాత న్యూస్ పేపర్లు సంపాదించి చూసుకోండి. లేదా పురావస్తు శాఖ వారి ద్వారా తెలుసుకోండి. మరి ఈ పుస్తకం వ్రాయడం నా దౌర్భాగ్యమో? సౌభాగ్యమో తెలియడం లేదు. నాసా వారు శ్రీకృష్ణ ప్రభువు అనే ఆయన ఒకరు ఉండేవారని, ఆయన ద్వారకా నగరం రాజధానిగా చేసుకుని పరిపాలన చేశారని సంవత్సరం క్రితమే న్యూస్ పేపర్‌లో ప్రకటించారు. మా పంచాంగం లెక్కల ప్రకారం 5100 సం॥ల క్రితం జరిగిన సంఘటన ఇది. దీనిని బట్టి మనకు నగర, గ్రామ రచనా సంప్రదాయం 5100 సం॥ల క్రితమే అని తెలుస్తున్నది. ఇది పురావస్తు శాఖ వారి అభిప్రాయం. దీనిని బట్టి మన యొక్క సంస్కృతి, సాంప్రదాయం ఎంత ప్రాచీనమైనవో ఒప్పుకు తీరావలసిందే. బ్రిటీష్ గవర్నమెంట్ వచ్చేవరకు మనకు క్రిష్టియన్ ERA గురించి తెలియదు. ఇది 200 సంవత్సరాల నుండే మనకు పరిచయం అయినది. కానీ మన చారిత్రక ఘటనలు అన్నీకూడా క్రిష్టియన్ ERA తో ముడిపెట్టుకుని క్రిష్టియన్ ERA A.D. క్రిష్టియన్ ERA B.C. అని చదువుకునే దుష్ట సాంప్రదాయానికి అలవాటు పడ్డాము. ప్రపంచ చరిత్రలో ఏ వ్యవహారం అయినా క్రిష్టియన్ ERA B.C.లో జరిగిన ఘనత మన భారత దేశానిదే అని గర్వించి ముందుకు వెళ్లండి. శ్రీకృష్ణ ప్రభువు ద్వారక

పట్టణం గురించి తెలుసుకున్నాం కదా! అంటే 5100 సం॥ల పూర్వమే సుశిక్షితమైన నిర్మాణ శైలి మనకు ఉన్నది అని మనకు తెలిసినది కదా! ప్రపంచానికి సరిగా గుడ్డ కట్టుకోవడం రాని రోజులలోనే మనవారు బ్రిటీష్ రాణికి అగ్గిపెట్టెలో పట్టే పట్టుచీరను నేసి పంపారు అని పెద్దలు చెబుతారు. పట్టుచీర నేయడం అంటే గణితానుగతంగా తయారైన మగ్గం ఉంటేనే చీర వచ్చేది. అంటే మ్యాథమెటికల్ అప్లికేషన్స్ మనవారు ఎప్పుడో చేశారు. వేదవాఙ్మయంలోనిదే కల్పశాస్త్రము. అందులోనిదే శుల్బసూత్రం. శుల్బసూత్రం ఆధారంగా మనవారు చతురస్ర, దీర్ఘచతురస్ర, వృత్త, అర్ధవృత్త రూపాలలో గణిత ప్రకారంగా అగ్నిహోత్ర వేదులు నిర్మాణాలు చేశారు. అంతే కాకుండా $(భుజము)^2 + (భుజము)^2 = కర్ణము^2$ అనేటువంటి కర్ణవర్గ సిద్ధాంతం ఎప్పుడో వాడుకుంటే మనవారు అదే సూత్రాన్ని ఇప్పుడు పైథాగరస్ సిద్ధాంతంగా చదువుకునే దౌర్భాగ్యం పట్టినది. మనకు ఎవరికీ ఆలోచించే అవకాశం రావట్లేదు. రేఖా గణితం (జామెంట్రీ), త్రికోణమితి (TRIGONOMETRY) మనవారు ఎప్పుడో చెప్పారు. వృత్త వైశాల్యం కనుక్కునే విషయంలో $\Pi r^2$ లో $\Pi$ విలువ 22/7 గా ఉన్నదానికి మన పూర్వులు చెప్పిన లెక్క 3927/1250 = 3.1255 కచ్చితంగా ఉందని ఈ మధ్యనే గణిత పుస్తకాల్లో మార్చారు. కొంత వరకు ఆనందించదగ్గ విషయం.

మన పంచాంగ లెక్కల ప్రకారం 2077 సం॥ల క్రితం వారు ఆదిశంకరాచార్యులవారు ఆయన అప్పటికే తన వివేక చూడామణి గ్రంథంలో **'జంతూనాం నరజన్మ దుర్లభః'** అని తెలిపారు. అనగా జంతువుల నుండి మానవ జన్మ ఉద్భవించినది అనే విషయాన్ని అప్పుడే చెబితే, మన పిల్లలు నేటి సమాజంలో ఈ సిద్ధాంతాన్ని సైన్స్ పుస్తకాల్లో డార్విన్ సిద్ధాంతంగా చదువుకుంటున్నారు. డార్విన్ ఎప్పటివారు? శంకరాచార్యుల వారు ఎప్పటివారు? ఇదీ మన దౌర్భాగ్యం. నేటి ప్రపంచం అంతా వేదిక్ మ్యాథమెటిక్స్ మీద రీసెర్చ్ జరుగుతోంది. ఈ వేదిక్ మ్యాథమెటిక్స్ ఏకాలానిది? మన సంస్కృతి ఎంత గొప్పది. ఇంత గొప్పదైన సంస్కృతికి మూలం సంస్కృతం. సంస్కృతం పరిచయం లేకపోవడం





మూలాన మన ప్రాచీన గ్రంథాలు చదివే శక్తి లేకపోవడం మూలంగా మన ప్రాచీన వాస్తు గ్రంథాల్లో పూర్వులు చెప్పిన విషయాల యందు ఆంతర్యం అర్థం కాక మనం ఈ చర్చకు అవకాశం ఇచ్చాం.

# వాస్తు శాస్త్రం ఎందుకు పుట్టింది?

నేటి సివిల్ ఇంజనీరింగ్‌కు సమానంగా పూర్వం వారు వాస్తు శాస్త్రం వాడుకున్నారు అని చెప్పుకున్నాం కదా! వాస్తు శాస్త్రంతో సంబంధం లేకుండా నిర్మాణాలు జరిగేవి కావు. అయితే నేటి సమాజంలో కూడా పాకలు, షెడ్డులు, పెంకుటిల్లు వంటివి సివిల్ ఇంజనీర్‌తో సంబంధం లేకుండా ఎలా కట్టుబడులు జరుగుతున్నాయో, పూర్వం కూడా వాస్తు శాస్త్రంతో సంబంధం లేకుండా నిర్మాణాలు అట్లాగే జరిగేవి. పూర్వం అక్షర జ్ఞానం లేనివారు, విజ్ఞానులు కానివారు అధికంగా ఉండేవారు. వారికి ఏదైనా విషయం చిన్నపిల్లవాడికి చెప్పినట్లుగా బెదిరింపుగా చెబితే వారు దాన్ని భయంతో అయినా ఆచరించే అవకాశం ఉండేది. ప్రేమగా చెప్పినా వింటూ ఉండేవారు. కావున వారందరికీ గ్రామ, నగర నిర్మాణ విషయంలో ఇబ్బందులు కలుగకుండా ఈ నిర్మాణాలు చేయించడం కోసం ఈ యొక్క వాస్తు శాస్త్రంలో ఈ పని చేస్తే ఈ ఫలితం వస్తుంది అనే విషయంగా తెలిపారు. మరొక విషయం ఏమిటంటే వాస్తు శాస్త్రం స్త్రీల రక్షణ, స్త్రీల సౌకర్యం, పారిశుధ్యం, పంక్తి శోభ, నగర నిర్మాణం దృష్టిలో ఉంచుకుని కొన్ని సైన్స్ పరంగాను, కొన్ని అవసరాలకు తగిన విధంగాను, కొన్ని అవకాశములను బట్టి మార్పులు,చేర్పులతోను, కొన్ని విషయాల్లో రెండు మూడు విధాలుగాను తెలియజేశారు. సైన్స్ అంటే ఏ విషయాన్ని అయినా రెండు మూడు విధాలుగా తెలియజేయదు కదా? వంటగది, పడక గది, ధాన్యగది వంటి వాటి విషయంలో ఈ విధంగా చేయుము అని మాత్రమే చెప్పారు. కానీ ఇలా చేయకపోతే నీకు నష్టం వస్తుంది అని ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు చెప్పలేదు. బాగా గమనించండి. ప్రాచీన వాస్తు శాస్త్రంలో కేవలం పబ్లిక్ అందరితోనూ సంబంధించి చేయవలసిన నిర్మాణాల్లో కాంపౌండ్ వాల్, పారిశుధ్యము (డ్రైనేజ్) ఇటువంటి వాటి

విషయాల్లో మాత్రం ఫలితాలు చెప్పారు. ఇలాచెప్పి ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు వారివైపు చర్చకు దిగేందుకు వీలుగా అవకాశాన్ని మాత్రం ఇవ్వలేదు. పారిశుద్ధ్యానికి ముడిపడినటువంటి లెట్రిన్, బాత్‌రూమ్, బావి మంచినీటి వాడకం, వాడకం నీరు పోవు మార్గం వంటి వాటికి మాత్రం ఇలాగే చెయ్యి, ఇలా చేయకపోతే నీకు నష్టం వస్తుంది అని రాజశాసనంలాగా తెలియజేశారు. దాంట్లో ఆంతర్యం ఏమిటో తెలుసా? అంత శాసనంగా చెబితే కానీ అజ్ఞాని వినడు. వాడి ఇష్టం వచ్చినట్లు నిర్మాణం చేస్తే ఇతరులకు ఇబ్బంది వస్తుంది. ఇక స్థల ఆకృతుల విషయం సరిగా లేకపోతే పంక్తిశోభ చెడుతుంది. గ్రామ, నగర విషయాల యందు ఇబ్బంది కలుగుతుంది. అందువలన వీటినన్నింటినీ దృష్టిలో ఉంచుకుని ఒక సిద్ధాంతం తెలియజేశారు. గ్రామ, నగర విషయం కూడా ప్రధాన భూమిక వహించేలాగా చేశారు. స్థలములు దీర్ఘచతురస్రం, చతురస్రం వంటి ఆకారాల్లో ఉండి, మూలమట్టానికి సరిపోయేలాగా ఉంటే ఎటువంటి ఇబ్బందులు లేకుండా గ్రామ నగర రచన చేయవచ్చు అనేటటువంటి ఆలోచనతో స్థలాలు ఏర్పాటు చేశారు. ఇంత సిస్టమ్యాటిక్‌గా వాస్తు శాస్త్రం నిర్మాణం చేశారు. రక్షణ అవసరాలు ఎక్కువగా పెరిగాయి. భారతదేశంలో అయితే మొగలాయి, బ్రిటీష్ ప్రభుత్వం వారు దాడుల రూపంలో భారత దేశానికి ఎక్కువగా ఇబ్బందులు కలుగజేశారు. అటువంటి సందర్భాల్లో కూడా మన నివాసముల విషయంలో కూడా రక్షణ కోసం విశ్వకర్మ దృష్టిలో ఉంచుకుని **'బ్రహ్మ గంధర్వ మనుష్య భాగత్రయ విభాజితం'** అనే సూత్రం కూడా అమలు చేశారు. గృహమును సింహద్వార దిక్కుతో సంబంధం లేకుండా బ్రహ్మ గంధర్వ మనుష్య భాగాలుగా విభజించి, అందులో **బ్రహ్మే వేద ప్రచ్ఛారశ్చ గాంధర్వే శయనాదికః మనుష్యే భోజన శాలాదిః క్రమాదేవం ప్రకీర్తితాః** అని చెప్పారు. బ్రహ్మభాగంలో అనగా ఇంటికి ముందు భాగంలో విద్యా వ్యాసంగా అతిథి గృహ, మిత్ర సమాగమ, కార్యాలయం వంటి వాటికి అవకాశం ఇచ్చారు. దీనికి సింహద్వారంతో సంబంధం లేదు, దిక్కుతో సంబంధం లేదు. గంధర్వ భాగం అనగా గృహమునకు మధ్యభాగం. గృహ యజమాని, యజమాని పిల్లలు, వారి





పడక గదులు, ధన ధాన్య నిల్వలు వంటి వాటికి ఇంటి మధ్యభాగం వాడుకోమని చెప్పారు. మనుష్య భాగం – ఇంటికి వెనుక భాగం. ఇది ఆడవారి సామ్రాజ్యం. వంటగది, భోజనశాల వంటివి ఇక్కడ ఏర్పాటు చేయమని చెప్పారు. ఇక్కడ గొప్ప సంస్కారం కూడా ఉన్నది గమనించండి. ఆడవారి పనులకు వారి సంస్కారమునకు ఇబ్బంది కలుగకుండా, పరాయి వారికి ప్రవేశం లేకుండా ఎంతో రక్షణతో కూడిన వాస్తు విజ్ఞానం మనకు మన ప్రాచీనులు అందించారు. ఒకసారి క్రింది పటమును పరిశీలించండి.

**రాజవీధి**

| | | | | |
|---|---|---|---|---|
| బ్రహ్మభాగం<br>మనుష్యభాగం<br>గంధర్వభాగం | బ్రహ్మభాగం<br>మనుష్యభాగం<br>గంధర్వభాగం | బ్రహ్మభాగం<br>మనుష్యభాగం<br>గంధర్వభాగం | బ్రహ్మభాగం<br>మనుష్యభాగం<br>గంధర్వభాగం | స్థలము / ఇళ్లు |
| గంధర్వభాగం<br>మనుష్యభాగం<br>బ్రహ్మభాగం | గంధర్వభాగం<br>మనుష్యభాగం<br>బ్రహ్మభాగం | గంధర్వభాగం<br>మనుష్యభాగం<br>బ్రహ్మభాగం | గంధర్వభాగం<br>మనుష్యభాగం<br>బ్రహ్మభాగం | |

**రాజవీధి**

| | | | | |
|---|---|---|---|---|
| బ్రహ్మభాగం<br>మనుష్యభాగం<br>గంధర్వభాగం | బ్రహ్మభాగం<br>మనుష్యభాగం<br>గంధర్వభాగం | బ్రహ్మభాగం<br>మనుష్యభాగం<br>గంధర్వభాగం | బ్రహ్మభాగం<br>మనుష్యభాగం<br>గంధర్వభాగం | స్థలము / ఇళ్లు |

ఒకవేళ దొంగవాడు ఆ దారిలో వస్తే దారికి అటూ, ఇటూ ముందర భాగాల్లో ఉండే వారు మగవారే కనుక వారందరూ ఏకమై దొంగను పట్టుకుని రక్షణ చేసుకునే అవకాశం ఉన్నది. మరి వెనుకవైపు ఆడవారు ఉంటారు. అందరి ఇండ్లకి కూడా వెనుకవైపున ఆడవారు ఉంటారు కాబట్టి వారికి ఒకరికి ఒకరు సహకారం చేసుకునేందుకు వీలుగా ఉంటుంది. నేను చెప్పేది అతిశయోక్తి కాదండోయ్! మీరు నేటికీ తమిళనాడులోని శ్రీరంగంలో ఈ విధమైన నిర్మాణం చూడవచ్చు. శ్రీరంగ

దేవాలయం చుట్టూ ప్రాచీన పద్ధతిలో నిర్మాణమైన ఊరు ఉంది. ఇది రక్షణ దృష్ట్యా, సంస్కార దృష్ట్యా ఎంత ఉపయుక్తమైన నిర్మాణ విషయమో మీరే ఆలోచించండి. సాంఘికంగా, సంస్కార పరంగా నివాస యోగ్యమైనటువంటి గృహ నిర్మాణాల ఏర్పాటు కోసం చేయబడినదే మన వాస్తుశాస్త్రం. వాస్తు శాస్త్రం ఆధునికులకు సంస్కృత భాష అర్థం కాక వారి చేతిలో పడి ఇష్టం వచ్చినట్లు చెప్పబడి పాడైనది. వారు వారికి తోచిన రీతిలో వాస్తు శాస్త్రం చెబుతున్నారు. శాస్త్రదూరమైన విషయాలు ఎన్నో నేటి సమాజంలో అమలులో ఉన్నాయి. ఇదంతా కూడా సంస్కృత భాషా పరిజ్ఞానం లేని ఆధునిక వాస్తు శాస్త్రజ్ఞుల మూలంగా జరిగిన దాడి. దీని ప్రభావంగా ప్రాచీన వాస్తు శాస్త్రం మొత్తం పాడైనది. ఆధునిక వాస్తు శాస్త్రజ్ఞులు చెప్పిన కొన్ని విషయాలు పరిశీలిద్దాం.

## ప్రస్తుత సమాజంలో ప్రజలు నమ్మలేని వాస్తు శాస్త్ర విషయాలు

1. ద్వారములు, కిటికీలు, అలమరలు సరి సంఖ్యలో రావాలి కానీ 10,20,30 సంఖ్యలో రాకూడదు అని శాస్త్రంలో మూల గ్రంథాలలో అనగా విశ్వకర్మ, మయుడు ఇత్యాదులు వ్రాసిన గ్రంథాలలో ఎక్కడా లేదు. దీనిని మాత్రం బాగా అమలు చేయుచున్నారు. కేవలం ద్వారాలు, కిటికీలు సరి సంఖ్యలు రావాలని మాత్రం ఉన్నది.

2. ఈశాన్య గదిలో వంట చేయకూడదని ఏ మహర్షి తెలియజేయలేదు. ఆగ్నేయంలో అవకాశం లేనప్పుడు ఈశాన్య గదిలో అయినా సరే, ఆగ్నేయ మూల వంట చేయవచ్చును.

3. ఉత్తర గది కంటే దక్షిణం గది పెద్దదిగా ఉండాలని కొందరు... దక్షిణం గది కంటే ఉత్తరం గది పెద్దదిగా ఉండాలని మరికొందరు వాదించుకుంటూ ఉంటారు. కానీ గదులు అన్నీ సమానమైన కొలతలో ఉండాలని సాంప్రదాయ వాస్తు సిద్ధాంతం.

4. కోణములలో అనగా గృహము యొక్క మూలలో గృహ యజమాని యొక్క పడకగదిని ఏర్పాటు చేయరాదు. కానీ ప్రస్తుత సమాజంలో నైఋతిలో మాస్టర్ బెడ్‌రూమ్ ఏర్పాటు చేయుచున్నారు.





5. సింహద్వారము అనేది విదిక్కులలో అనగా ఈశాన్యం, దక్షిణ ఆగ్నేయం, పశ్చిమ వాయువ్య దిశలలో నిషేధింపబడినది. కానీ నేడు ఈ సిద్ధాంతమే బాగా అమలులో ఉంది.

6. బరువు అనే మాట వాస్తు శాస్త్రంలో ఎక్కడా లేదు. మెట్లను కూడా తూర్పు, ఉత్తర దిశలలో నిర్మించవద్దని, అది నిషేధమని, అలా నిర్మించుట ద్వారా ఇబ్బందులు కలుగుతాయి అనేది కేవలం అపోహ మాత్రమే.

7. అలమరలు తూర్పు,ఉత్తర గోడలకు నిర్మించరాదు అనుట హాస్యాస్పదమే అయిన విషయము. దీని వలన ప్రత్యేకించి ఇబ్బందులు వస్తాయి అనుట ఆధారరహితమైన విషయము.

8. స్థలంలో దక్షిణ పశ్చిమ దిశలలో హద్దు మీద నుండి నిర్మాణం చేయవచ్చుననుట శాస్త్ర విషయం కాదు. కానీ దీనిని అవసరార్థం ఏర్పాటు చేసుకున్నాము.

9. స్థలం నైఋతి నుండి క్రమంగా ఈశాన్యం వరకు వాలుండాలి అన్నప్పుడు అందులో నిర్మించు ప్రతి నిర్మాణము అప్రయత్నంగా ఈశాన్య వాలు కలిగి ఉంటుంది. ఉదాహరణకు ప్రహరీగోడ ఇంటి చుట్టూ ఆరు అడుగుల ఎత్తులో కడితే, ఆ ప్రహరీ నైఋతి ఎత్తుగా ఉండి, ఈశాన్యం పల్లంగా ఉంటుంది. నేటి వాస్తు పండితులు దక్షిణ, పశ్చిమ గోడలు తూర్పు, ఉత్తర గోడలకంటే ప్రత్యేకంగా ఎత్తుపెట్టిస్తున్నారు. తూర్పు, ఉత్తర ప్రహరీ గోడలు ఆరు అడుగులు ఉంటే, దక్షిణ పశ్చిమ ప్రహరీలు ఆరున్నర, ఏడు అడుగుల వరకు పెట్టిస్తున్నారు. నైఋతిలో నిర్మాణం బాగా ఎత్తుగా ఉండాలని ప్రచారం చేస్తున్నారు. వీటికి ఆధారం ఎక్కడా లేదు.

10. పై విధంగా ఉన్న స్థలముకు ఈశాన్యం పెరిగినట్లుగా ఎక్కడా చెప్పబడి లేదు. కానీ దీనిని షట్కోణ ఆకార స్థలంగా ప్రాచీనులు విసర్జించారు. అయితే దీనిని ఈశాన్యం పెరిగిన స్థలంగా ఆధునికులు చెప్పుటలో అంతర్యం కనబడలేదు.




11. వీధి శూలల గూర్చి నేడు మనం చూసే ప్రతి పాఠము మన ప్రాచీన వాస్తులో లేదు.

## ప్రాచీన వాస్తు నేర్చుకునే విధానం

విశ్వకర్మ వాస్తు, మయవాస్తు, సమరాంగణ సూత్రధార, మానసారము ఇత్యాది గ్రంధముల ద్వారా ప్రాచీన వాస్తు శాస్త్రమును నేర్చుకోవచ్చును. అలాగే మత్స్య పురాణము, అగ్ని పురాణము, భవిష్య పురాణము వంటి పురాణముల ద్వారా కొంత పరిజ్ఞానము సంపాదించుకోవచ్చు. నారద సంహిత, కాలామృతం, వశిష్ఠ సంహిత, బృహత్ సంహిత వంటి కొన్ని సంహితలు కూడా వాస్తు పరిజ్ఞానము అందజేయును. పై మూల గ్రంధములే కాక శిల్పరత్నము, అపరాజిత పృచ్ఛ, మనుష్యాలయ చంద్రిక వంటి చక్కటి గ్రంధములు ఉన్నవి. పై గ్రంధముల ఆధారంగా రచింపబడిన గ్రంధములు మరికొన్ని ఉన్నాయి. అందులో వాస్తురత్నాకరము, బృహద్ వాస్తుమాల, వాస్తుశాస్త్ర వివేకము కలవు. అయితే ఇవి అన్నీ కూడా ప్రస్తుతం లభ్యమవుతున్నవి. వీటిని గురుముఖతగా నేర్చుకోవాలి. అయితే ప్రస్తుతం లభ్యమవుతున్న ఈ గ్రంధములు తెలుగు, హిందీ, ఇంగ్లీషు భాషలో కూడా ఉన్నవి.

చౌకాంబా ప్రకాశన్, కాశీవారిచే సమరాంగణ సూత్రధార, మానసారము, మయవాస్తు, విశ్వకర్మ వాస్తు విక్రయించబడుతున్నవి. మోతీలాల్, బనారసీదాస్ బెంగుళూరు వారిచే మయవాస్తు ఇంగ్లీషు వాఖ్యతో రెండు వాల్యూములుగా విక్రయించబడుతున్నవి. వాస్తు రత్నాకరం, బృహద్వాస్తుమాల కూడా చౌకాంబా వారిచే ప్రచురించబడినవి. వాస్తుశాస్త్ర వివేకము నాలుగు భాగాలుగా బ్రహ్మశ్రీ మధుర కృష్ణమూర్తి గారిచే రచింపబడి జ్యోతిష విజ్ఞాన కేంద్రం, రాజమండ్రి వారిచే ప్రచురింపబడుతున్నవి. కొన్ని ప్రాధమిక అంశాలతో ప్రాచీన వాస్తును వాస్తుసుధ అనే పుస్తక రూపంలో నేననూ వ్రాసి యుంటిని. ఈ గ్రంధములు అర్ధం చేసుకునేందుకు సరళ శైలిలో ఉన్నది.

## అద్దెకు ఇవ్వాలి అంటే ఎటువైపు ఇవ్వాలి?

ఇది శాస్త్రంలో లేని విషయం. కానీ సమాజంలో ఉన్న అపోహలకు సమాధానం చెప్పవలసిన అవసరం ఉంది. నేటి సమాజాన్ని పట్టి పీడిస్తున్న





పెద్ద సమస్య. కొందరు ఈశాన్య భాగాన్ని అద్దెకు ఇవ్వాలి. దక్షిణ, పశ్చిమ భాగాలలో యజమాని ఉండాలి అని మరికొందరు ఈశాన్యభాగంలో యజమాని ఉండాలి అని ఇలా వివిధ రకాలైన సిద్ధాంతాలను ప్రతిపాదించారు. సరే ఇక్కడ మనం కొన్ని విషయాలను తెలుసుకుందాం.

(అద్దెకు ఏ దిశలో ఇవ్వాలి అనేది శాస్త్రంలో ఎక్కడా లేని విషయం)

1. సింహద్వారం అనేది ఇంటి యజమాని యొక్క పేరు బలాలను బట్టి నిర్ణయిస్తారు. కావున ఆ ఇంటి సింహద్వార భాగాన్ని అద్దెకు ఇవ్వడం పనికిరాదు.
2. ప్రాచీన పద్ధతిలో గర్భము దాని, వైశాల్యము కూడా యజమాని యొక్క పేరు బలాలను బట్టి ఉంచుతాము కావున దానిని కూడా అద్దెకు ఇస్తే ఫలితం లేదు. గర్భంలో ఒక భాగం అద్దెకు ఇచ్చిన మన పేరున ఉన్న గర్భమును భాగం చేయడం వలన ఆ గృహం యొక్క ఫలితం వ్యతిరేకతను చూపుతుంది..
3. దక్షిణ లేదా పశ్చిమ భాగాలలో అద్దెకుఇస్తే పరిస్థితి ఏమిటంటే దక్షిణ పశ్చిమ దిశలు మెరకలో ఉంటాయి. కావున ఈ దిశలో అద్దెకు ఇస్తే ఇద్దెకు ఉండేవారు యజమాని కంటే ఎత్తులో ఉంటారు. కావున అది కుదరదు.
4. ఇక ఈశాన్యం విషయానికి వస్తే ఈశాన్యం శుభప్రదమయినది, మంగళ ప్రదమయినది. అటువంటి ఆ స్థానమునకు వేరే వాడికి ఇచ్చేస్తే?
5. గర్భంలో ఈశాన్యంలో శంఖుస్థాపక చేస్తాం. కావున మనం శంఖుస్థాపన చేసిన భాగాన్ని మనమే అనుభవించాలి. దీనిని బట్టి ఆలోచిస్తే గ్రౌండు ఫ్లోర్‌లో అద్దెకు ఇవ్వదలిస్తే కేవలం ఆగ్నేయ, వాయువ్యాలు మాత్రమే మిగిలినవి. ఇన్ని ముఖ్య విషయాలు వదిలివేసి ఈశాన్య భాగం అద్దెకు ఇవ్వాలి? లేక మనక్రిందనే ఉంచుకోవాలా? అనే విషయమై చర్చ అర్ధరహితమైనదిగా ఉంటుంది.

పై అంతస్తుల విషయం ఆలోచిద్దాం. సింహద్వారము అనేది ఇంటికి ఎన్ని వాటాల ఇల్లు అయినా సరే. ఎన్ని అంతస్తుల ఇల్లు అయినా సరే ఒకటే ఉంటుంది. అంతే కాకుండా ఎన్ని అంతస్తు ఇల్లు అయినా సరే

శంఖుస్థాపన ఒకేసారి జరుగుతుంది. అందువలన ఈ రెండు విషయాలు (శంఖుస్థాపన, సింహద్వారం) కూడా గ్రౌండ్ ఫ్లోర్‌కే ఉంటాయి. కావున యజమాని గృహంలో గ్రౌండ్ ఫ్లోర్‌లోనే ఉండాలి. అలా కాక పై అంతస్తులలో గృహ యజమాని నివాసం ఉంటే ఆ ఇంటి ప్రభావం (అది మంచి అయినా చెడు అయినా సరే) ఆ ఇంట గ్రౌండ్ ఫ్లోర్ అనుభవించే వారికి మాత్రమే ఉంటుంది. ఇంటికి గ్రౌండ్ ఫ్లోర్‌ను ప్రధాన గృహం అని, పై అంతస్తులు ఉప గృహాలని అంటారు. ప్రధాన గృహంను యజమాని అనుభవించాలి.

## ఆధునిక వాస్తులో విశేషములు ఏమిటి?

ప్రాచీన వాస్తు శాస్త్రం మీద, సామాజిక పరిస్థితుల మీద, సంస్కృతి సంప్రదాయముల మీద అవగాహన లేనివారు ప్రాచీన వాస్తు శాస్త్రకారులను విమర్శించడం తప్ప మరొకటి లేదు. నా ఈ పుస్తకం ప్రత్యేకించి ప్రతి దానికి పూర్వశాస్త్రజ్ఞులు చెబుతూ వచ్చిన ధర్మాలని ఉటంకిస్తూ వచ్చాను. కొన్ని చోట్ల నా అభిప్రాయాలను స్వతంత్రించి వ్రాశాను. అయితే ఆధునికులు వారి రచనలలో పూర్తిగా ప్రాచీన పద్ధతికి స్వస్తి పలికారు. అలాగని వీరు విశేషమయిన శాస్త్రాన్ని అందించారా? లేదు. శాస్త్రంలో ఆధునికం రాదు. శాస్త్రం చెప్పేవారిలోను శాస్త్రం వాడుకునే వారిలోను ఆధునికం ఉంటుంది. చిన్నపిల్లలను, రామాయణం, మూడు ముక్కలలో చెప్పండి అంటే 'కట్టే, కొట్టే, తెచ్చే' అంటారు. నేటి ఆధునిక వాస్తు శాస్త్రజ్ఞులు చెప్పే విషయం కూడా అలాగే ఉన్నది. ఆధునికులు ప్రాచీన సాంప్రదాయములు పాటించలేక, ప్రాచీన సిద్ధాంతం అర్థం చేసుకోలేక నూతన సిద్ధాంతమును అందజేశారు. చెడు త్వరగా వ్యాప్తిచెందుతుంది అన్నట్లుగా ఈ ఆధునిక వాస్తు కూడా త్వరగా వ్యాపింపబడినది. ఒకసారి ఆలోచించండి. ప్రతిదానికి....

1. ఈశాన్యంలో బరువు పనికిరాదు. నైఋతిలో బరువు ఎక్కువ ఉండాలి.
2. దక్షిణం, పశ్చిమం ఎత్తు ఎక్కువ తూర్పు ఉత్తరాలలో తక్కువ. ఇది ప్రతి విషయానికి (ప్రహరీ, గోడలు, గుమ్మాలు, ఫ్లోరింగ్‌లు మొ॥నవి)





3. స్థలం వదిలే విషయం గదుల పరిమాణం, ఇత్యాదులకు దక్షిణం పశ్చిమం కంటే ఉత్తరం తూర్పు ఎక్కువ ఉండాలి.

ఇవి తప్ప మరొకటి లేదు. ఇంకా మాట్లాడితే తూర్పు ఉత్తరాలలో బరువు ఉండకూడదు. దక్షిణ, పశ్చిమాలలో ఎక్కువ ఉండాలి అని చెబుతారు. ఇంతకు మించి మరొక పాఠం లేదు. ఈ మాటల ప్రకారంగా ఈశాన్యంలో దేవుడు బరువు అయ్యాడు. ఈశాన్యంలో దేవతా మందిరాలను పీకేసే వాళ్లు ఎంతోమంది ఉన్నారు. ఇలా ఈశాన్యంలో దేవతా మందిరం లేకపోవడం అనేదాని వలన ఒక విశేషమయిన ఆర్షధర్మాన్ని పాడు చేస్తున్నాం. అది ఏమంటే పూజా కార్యక్రమం విశేషించి తూర్పు ముఖంగా కూర్చుని చేయాలి అనే సిద్ధాంతాన్ని పాడు చేసింది ఈ ఆధునిక వాస్తు. అలాగని వంటగదిలో తూర్పు గోడకు ఆనించి, గ్యాస్ గట్టు కట్టి వంట చేయకూడదు అది బరువు అని చెప్పారా? లేదు. అది మాత్రం చెప్పలేదు. ఒక్క దేవుడే ఇంట్లో ఈశాన్యంలో బరువు అయ్యాడు. ఈశాన్యంలో బరువు పిచ్చి ఎంతవరకు వచ్చింది అంటే చివరకు మనుషులను కూడా ఇంట్లో ఈశాన్యంలో కూర్చోనీయడం లేదు. ఇల్లు ఈశాన్యానికి తిప్పి కడుతున్నారు. అప్పుడు కొంతకట్టుబడి ఈశాన్యంలో పెంచుతున్నారు. ఇదెలా పనికి వస్తుంది? ఇలా అన్వయం కుదరని మాటలకి అందంగా ఆధునిక వాస్తు అని పేరు పెట్టారు. ఇక రెండవ విషయం పరిశీలిద్దాం.

1. నైఋతిలో బరువులు కూడా ఉండకూడదు. ద్వారం, కిటికీలు కూడా ఉండకూడదు అని చెబుతారు ఆధునికులు.
2. నైఋతిలో మాస్టర్ బెడ్‌రూమ్ ఉండుట విశేషం అని కూడా చెబుతారు.
3. దక్షిణ పశ్చిమ దిశలలో ప్రహరీ ఎత్తుగా కట్టవలెను అనిరి ఈ ఆధునికులు. ఒకసారి ప్రకృతి గూర్చి ఆలోచించండి. ఉత్తరాయణంలో సూర్యుడు తూర్పు, ఈశాన్య భాగం మధ్యలో ఉదయించి, నైఋతిలో అస్తమిస్తాడు. అలాగే దక్షిణాయణంలో తూర్పు, ఆగ్నేయ దిశల మధ్య ఉదయించి, నైఋతిలో అస్తమిస్తాడు. ఎలాగైనా నైఋతిలోనే అస్తమిస్తాడు

సూర్యుడు. నైఋతిలో మాస్టర్ బెడ్‌రూం అన్నప్పుడు మధ్యాహ్నం తరువాతే ఆ గదికి సూర్యుని కిరణాల ద్వారా వెలుతురు వచ్చేది. అటువంటి ఆ గదికి నైఋతి భాగంవైపు కిటికీలు లేకుండా పైగా, దక్షిణ పశ్చిమ దిశలలో ఎత్తైన కాంపౌండ్ నిర్మాణం చేయుట వలన, ఆ గదిలో గాలి, వెలుతురు తగ్గుతుంది. ఉత్తర పశ్చిమ సింహద్వారం వారు నైఋతిలో అధిక బరువు అని మెట్ల కూడా వేస్తారు. ఇక ఆ గదిలోకి వచ్చే వెలుతురు ఏమిటి? బరువు పేరుతో నైఋతిని మూస్తే ఆ గదిలో నివసించే వారికి గాలి, వెలుతురుల లోపం వలన అనారోగ్యం రాదా? ఇది నేటి మన సమాజంలో ఆధునిక వాస్తు పరిస్థితి.

ప్రాచీన గృహములను గూర్చి ప్రాచీనులను పల్లెటూర్లలోని పెద్దలను సంప్రదించండి. వారు ప్రతి ఇల్లు, ఆ ఇంటి చరిత్ర చెబుతూ ఆ ఇల్లు 10 తరాల వారు అనుభవించారు అనో, లేక 15 తరాల వారు అనుభించారు అనో చెబుత్తారు. కానీ ప్రస్తుత సమాజంలో ఆధునిక పద్ధతులలో నిర్మాణం అవుతున్న ఇళ్లు రెండో తరంలోనే, లేక మూడో తరంలోనే చేయి మార్పు జరుగుతున్నది.

### ఆధునిక వాస్తులో చాలా హాస్యాస్పదమైన మరొక విషయం

1. దక్షిణం, పశ్చిమం హద్దులలో నిర్మాణం చేసుకోవచ్చు సరే.
2. ఉత్తరం తూర్పు తప్పని సరిగా ఖాళీ ఉంచాలి సరే.
3. మొక్కలు లేకుండా ఇల్లు ఉండకూడదు సరే.
4. తూర్పు, ఉత్తరాలలో బరువు ఉండకూడదు. ఇది ఎలా కుదురుతుంది. దక్షిణ పశ్చిమాలు ఖాయం చేసుకోవచ్చు అన్నప్పుడు మొక్కలు తూర్పు ఉత్తరాలలో కాకుండా మరి ఎక్కడ వేస్తారు? ఇలా పిచ్చిమాటలు, మతిభ్రష్ట మాటలు చెప్పే తూర్పు, ఉత్తర దిశలలో కొబ్బరి, మామిడి వంటి ఫలవృక్షాలు సైతం నరికి వేయిస్తున్నారు ఈ ఆధునిక వాస్తు శాస్త్రజ్ఞులు.

భారతంలో మార్కండేయ మహర్షి, గీతలో కృష్ణుడు, కాల జ్ఞానంలో వీరబ్రహ్మం గారు చెప్పినట్లుగా అర్ధ (సగం) పండితులు చెప్పినది ఎక్కువగా అమలులోకి వస్తుంది అన్నారు. అలాగే జరుగుతోంది. నేటి సమాజంలో





ఈ విధంగా ఆధునిక వాస్తు శాస్త్రం చెప్పేవారు ప్రజల మన్ననలు పొందవచ్చును గానీ, 'పరమానందజనకం దేవానామిదమీరితం' దేవతలకు ప్రీతికరమైన ఈ వాస్తుని పాడు చేయుట మరియు దానికి అపహాస్యం చేయుటని దేవతలు సహించరు.

## ఏకాశీతి పద మండల వాస్తు

గృహనిర్మాణం చేయబోవు స్థలమును వెడల్పును తొమ్మిది సమభాగాలు చేయవలెను. పొడవును తొమ్మిది సమ భాగాలుగా

### ఏకాశీతిపదవాస్తు

(వాస్తుపురుష శయనక్రమం)




చరకి | శర్వస్కంధ | విదారి

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| శిఖి శిర: | పర్జన్య: దక్షిణ నేత్రం | జయన్త: ద.కర్ణం | ఇంద్ర: ద.అం | సూర్య: ద.బా | సత్య: వా.మూలం | భృశ: బా.మ | ఆకాశం ద.కపోది | వాయు: ప్రకోష: |
| దితి: వామ నేత్రం | ఆప: ముఖం | | | | | | సావిత్ర: అంగుళీ మూలం | పూషా దక్షిణ మణిబంధ |
| అదితి: వామకర్ణం | | ఆపవత్సా వక్షస్థలం | | అర్యమా ద.స్తనం | | సవితా అంగుళీ అగ్రం | | వితథా ద.పార్శ్వం |
| సర్పః వా.అంగం | | | బ్రహ్మ | బ్రహ్మ | బ్రహ్మ | | | గృహక్షత: ద.పార్శ్వం |
| సోమః వా.బాహు | | పృథ్వీధర: వామస్తన: | బ్రహ్మ | బ్రహ్మ | బ్రహ్మ | వివస్వాన్ ద.జఠరం | | యమ: ద.ఊరువు |
| భల్లాటః బాహు మూలం | | | బ్రహ్మ | బ్రహ్మ | బ్రహ్మ | | | గంధర్వ: దజానువు |
| ముఖ్య: బాహు మధ్యం | | రాజయక్ష్మ అంగుల్యగ్రం | | మిత్ర: వామజఠరం | | విబుధాధిప మేఢ్రం | | భృంగరాజ: ద.జంఘం |
| నాగ: వా.కపోది | రుద్ర: అంగుళీ మూలం | | | | | | ఇంద్ర: జయ: మేఢ్రం | మృగ: ద.స్ఫిక్ |
| రోగ: ప్రకోష్ఠం | పాప: వా.మణి బంధం | శోష: వా.పార్శ్వం | అసుర: వా.పార్శ్వం | జలాధిప: వా.ఊరువు | పుష్పదన్త: వామజాను | సుగ్రీవ: వా.జంఘం | దౌవారిక: వా.స్ఫిక్ | పితృగణ: పాద: |

పాపరాక్షసి | జృంభక | పూతన

(left side: పిలిపింఛ; right side: [illegible])

చేయవలెను. పటం చూడండి. మరియు పై మాటను కూడా పరిశీలించండి. ఈ రెంటి దృష్ట్యా స్థలంలో పెరుగుదల, తరుగుదల లేకుండా చతురస్ర, దీర్ఘ చతురస్ర స్థలములకు ఎక్కువ ప్రాముఖ్యత ఏర్పాటు చేశారు.

**ఏకాశీతి పద వాస్తులో ద్వాత్రింశ దంశాః పైశాచ్యాః ప్రాకారాయ సమీపగాః ఏతేషు గృహ నిర్మాణం శోకరోగ భయప్రదం**

ఏకాశీతి పదమండల వాస్తు ప్రకారం మొదటి ఆవృతి (ప్రహరీకి) దగ్గర్లో అంతా నిర్మాణమునకు పనికిరాని స్థలంగా పరిగణించారు. అనగా మన స్థలంలో 1/9 వంతు చుట్టూ ఖాళీ వదలమని చెప్పారు. ఏమండీ ఇది సైంటిఫిక్ రీజన్ కాదా? మున్సిపాలిటీలు, పంచాయితీలలో కూడా ఈ సిద్ధాంతాన్ని 100% అమలు చేయడం వలన ఎంత ప్రశాంత కాలనీలు ఏర్పడతాయి. ఒకసారి ఆలోచించండి. అయితే ఈ రోజులలో ఇంటి చుట్టూ 1/9 వంతు స్థలం వదలకుండా గృహ నిర్మాణం చేయడం వలన గృహమునకు జైలుకు తేడా లేకుండా పోయింది. గాలి వెలుతురు సరిగా ప్రసరించని కారణంగా చాలా చిత్ర విచిత్రమైన రోగాలు కూడా ఈ రోజున మనం అనుభవిస్తున్నాం. ఆలోచించండి. ప్రాచీన వాస్తు శాస్త్రంలో ఈ మంచి విషయాన్ని అమలు చేయడం కోసం 1/9 వంతు వదలకుండా కట్టడం ద్వారా దుఃఖము రోగము కలుగుతాయి. అందువలన భయప్రద జీవనం చేయవలసి ఉంటుంది అని చెప్పి, వారిని 1/9 వంతు స్థలం వదిలేలా చేసి, గృహ నిర్మాణం చేయించారు. నేడు మున్సిపాలిటీలు 1/9 వంతు అని కాదు కానీ చుట్టూ ఎంతో కొంత స్థలం వదిలే నియమం ఉంచినా నియమోల్లంఘనలు ఎందుకు జరుగుతున్నాయి అనే విషయం ఒకసారి ఆలోచించండి. నేటి నిర్మాణాల కోసం గవర్నమెంట్ విధించిన ఈ నియమాలను మన మహర్షులు ఎప్పుడో విధించారు అంటే మీకు ఆనందంగా ఉన్నదా? లేదా? గవర్నమెంట్ విధించిన నియమం సైన్స్. మనవాళ్లుచెప్పిన శాస్త్రం సైన్స్ కాదా? ఆలోచించండి.

ఈ విషయాలు కూడా ప్రాచీనులు సిస్టమాటిక్ స్టడీగా అందించారు.





## ఇంటిపారులు వెనుగాడులు

ఏమండీ నేటి వ్యాంబే కాలనీల దగ్గర నుండి మార్కెట్ యార్డ్‌లు హౌసింగ్ బోర్డులు, కంపెనీ క్వార్టర్స్ ఇవన్నీ కూడా మీరు పారులు తప్పకుండా కడుతున్నారు కదా? మరి మనప్రాచీనులు కూడా ఇదే నిర్ణయాన్ని చెప్పారు. మరి మన ప్రాచీనులు చెప్పిన దానికి అపహాస్యంగా మాటలాడుకోవడం దేనికి. మీరు ఏ దృష్టితోచెప్పారో? కానీ మన మహర్షులు మాత్రం పంక్తిశోభను పారిశుద్ధమును ముందుగానే యోచించారు అనే చెప్పాలి. తొందరపడి వాస్తు శాస్త్రాన్ని అపహాస్యంగా మాటలాడకండి. నేను చెప్పేది కేవలం ప్రాచీన వాస్తు గూర్చి మాత్రమే, ఆధునిక వాస్తు గురించి మాత్రం కాదండోయ్. వెనుగాడులు కూడా సమాంతరంగా చేయుటలో ఆంతర్యం కూడా అదే. ప్రాచీనులు కూడా ఈ విషయంలో సిస్టమాటిక్ స్టడీ ఇచ్చారు.

## ఇంటికి చుట్టూ వదిలే ఖాళీ విషయం

ఇది ఆధునికులు చెప్పే విధంగా మాత్రం మహర్షులు చెప్పలేదు. వారు కేవలం గృహ నిర్మాణానికి ప్రాముఖ్యం చూపారు కానీ ఖాళీ గూర్చి చెప్పలేదు. అయితే ఆధునికులు దక్షిణం తక్కువ, ఉత్తరం ఎక్కువ, పడమర తక్కువ తూర్పు ఎక్కువ ఉండాలి అని చెబుతున్నారు. మరి మన ప్రాచీనులు వాడిన కొటేషన్స్ పరిశీలిస్తే మీకు అర్థం అవుతుంది. ఈ ఖాళీ స్థలం వదిలే విషయం మనవారు చెప్పలేదు అని.



పడమర సింహద్వారం
తూర్పు ఇల్లు



పడమర సింహద్వారం
పడమర ఇల్లు



ఉత్తర సింహద్వారం దక్షిణం ఇల్లు



ఉత్తర సింహద్వారం ఉత్తరం ఇల్లు



తూర్పు సింహద్వారం పడమర ఇల్లు



తూర్పు సింహద్వారం తూర్పు ఇల్లు



దక్షిణ సింహద్వారం దక్షిణ ఇల్లు



దక్షిణ సింహద్వారం ఉత్తర ఇల్లు

ఈ పై విధంగా ఎనిమిది విధాలుగా గృహాలను విభజించారు. అయితే మీకు ఈ విషయం అనుమానం రాకుండా మరొక ఉదాహరణ కూడా చెబుతాను. చుట్టూ 1/9 వంతు ఖాళీని మాత్రం కచ్చితమైన నియమంగా చెప్పి, మిగిలిన విషయాలను అసలు స్పృశించలేదు. అందువలన వాస్తు విమర్శకులకు విజ్ఞప్తి. మీరే దయచేసి ఈ విషయాన్ని మన ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు చెప్పారేమో అనే అపోహలో అపహాస్యంగా ప్రవర్తించకండి. ఇంటికి చుట్టూ ఖాళీ వదిలే విషయంలో ఎక్కువ తక్కువల గురించి ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు చెప్పలేదు.





# లెట్రిన్, బాత్‌రూమ్‌లు

లెట్రిన్, బాత్‌రూమ్‌లు మనం ఎందుకు వాడతామో మీకు నేను ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. అయితే అవి ఎక్కడ కట్టాలో చెప్పాలి. సరే నేడు ఈ లెట్రిన్ నిర్మాణం, లెట్రిన్ ట్యాంక్ నిర్మాణం మీద చాలా అపోహలు ఉన్నాయి. కొందరు నైఋతి లెట్రిన్ గొయ్యి పనికిరాదని, మరికొందరు వాయవ్యం పనికిరాదని, మరికొందరు ఆగ్నేయం పనికిరాదని అందరూ కలసి ఈశాన్యంలో పనికిరాదు అని, ఇలా ఎవరి దోవన వారు చెబుతున్నారు. అయితే ఇక్కడ బాగా గమనించండి. నైఋతి, వాయవ్య, ఆగ్నేయ దిశలలో ఎక్కడ అయినా కడుతూనే ఉన్నారు.

బాత్‌రూమ్‌ల నిర్మాణం విషయంలో తూర్పు, ఆగ్నేయ, ఈశాన్య దిశలలో నిర్మించమని ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు తెలిపారు. మయమతంలో 'ఆరాధనా గృహమీశే కూపం తత్రోదికం స్నానమ్' అని తెలిపారు. ఈశాన్యంలో బావిని ఏర్పాటు చేసి, దాని దగ్గర్లోనే స్నానగదిని ఏర్పాటు చేయమని చెప్పారు. నారద మతంలో ఆగ్నేయములో స్నానగృహం చెప్పబడినది. కాలామృతంలో 'ప్రాచ్యాం స్నానగృహం' తూర్పు దిక్కున స్నానగృహం చెప్పబడినది. మరియు 'దైతేయాంతక యోః పురీష సదనం' అనగా దక్షిణ నైఋతిల మధ్య మలమూత్రాదులకు నిర్మాణం చెప్పబడినది. అయితే విశ్వకర్మ మతంలో ఇంటికి వెనుకభాగంలో స్నాన, మల, మూత్ర విసర్జనలకు గృహములు చెప్పబడినది. దీనిని బట్టి ఆలోచిస్తే...

బాత్‌రూమ్‌లు (స్నాన గృహములు) ఇంటికి వెనుక భాగంలో నిర్మాణం చేయుట. ఇది కేవలం ఆడవారికి ఇబ్బంది కలుగకూడదు అనే ఉద్దేశ్యం దృష్ట్యా చెప్పినది మాత్రమే. సౌకర్యంకోసం సంస్కారంతో ఆలోచించి చేసినది. ఈశాన్యంలో బావి, దాని దగ్గర్లో స్నానగది చెప్పారంటే మరి మనవారు ఆడవారి సౌకర్యం ఎంత ఆలోచించారో గుర్తుంచుకోండి. ఆలోచించండి. పూర్వం మోటర్లు, ట్యాంకులు లేవు కదండి. మరి ఇంటికి వెనుకభాగంలో బాత్‌రూమ్ చెప్పారంటే గోప్యం (ప్రైవసీ) ఆలోచించారా? లేదా? ఒకసారి దృష్టి యందు ఉంచుకుని ఇది సైంటిఫిక్‌గా చెప్పారా?

లేక సౌకర్యం కోసం చెప్పారా? ఆలోచించండి.

నేటి సమాజంలో ఆధునిక వాస్తు శాస్త్రజ్ఞులు చెప్పే దోషములు.

1. ఆగ్నేయంలో నీటి వాడకం ఆడవారికి అనారోగ్యం
2. నైఋతిలో నీటి వాడకం మానసిక చికాకులు
3. ఈశాన్యంలో బరువు ఉండకూడదు.. ఇక అందరు ఒప్పుకున్నది వాయవ్యం ఒక్కటే. ఈ ప్రకారం వాయవ్యంలో లెట్రిన్ కడితే ఉత్తరం సింహద్వారంలో వారు గుమ్మంలోకి రాగానే బాత్‌రూమ్ కనబడుతుంది. ఇది ఆడవారికి ప్రైవసీని అందించగలదా? లేదు. ఇలా సంస్కార హీనమైన నిర్మాణాలు ఆధునికులు తెలియ జేస్తున్నారు.

మరి మన ప్రాచీన సిద్ధాంతం ప్రకారం తూర్పు సింహద్వారం వారు తూర్పు దిశలలో కాక మరి ఏ ఇతర దిశల్లో అయినా బాత్‌రూమ్ నిర్మించవచ్చు. అలాగే దక్షిణం వారు, దక్షిణం మినహా మిగిలిన ఏ దిశలో అయినా నిర్మించవచ్చు. అలాగే పడమర, ఉత్తర సింహద్వార గృహాల వారు పడమర, ఉత్తర దిశలు మినహా ఏ ఇతర దిశలో అయినా గృహ నిర్మాణం చేయవచ్చు. అయితే నాస్తికులకు ఒక విజ్ఞప్తి. ఈ అంశాన్ని దృష్టిలో ఉంచుకుని లెట్రిన్ బాత్‌రూమ్‌లు అక్కడే ఎందుకు నిర్మించుకోవాలి? ఇక్కడ ఎందుకు నిర్మించకూడదు? అనే అంశం విషయంలో దయచేసి ఆధునిక వాస్తు వారిని ప్రశ్న అడగండి. కానీ ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులను అడగకండి. అపహాస్యంగా ఉంటుంది. సంస్కారం గురించి మీకు అర్థం గాక తప్పని మాత్రం అనవద్దని మనవి. మన ప్రాచీనులు వాస్తు సంబంధమైన ఏ అంశాన్ని అందించినా అది సైంటిఫిక్ రీజన్ అయినా అయి ఉంటుంది. లేక స్త్రీలకు సౌకర్యం కలిగించే విషయంగా అయినా ఉంటుంది.

ఇంటికి ముందర భాగాలలో మగవారి కార్యకలాపాలకు సంబంధించి గదులు ఏర్పాటు చేసుకోమని చెప్పారు కదా. తూర్పు సింహద్వారం ఇంటికి తూర్పు గదులలో అవి ఏర్పాటు అవుతాయి. అటువంటి సమయాలలో ఈశాన్యంలోనో తూర్పు దిశలోనో, ఆగ్నేయ దిశలోనో లెట్రిన్, బాత్‌రూమ్‌లు ఏర్పాటు చేస్తే ఎంత అసహ్యంగా ఉంటుంది.





ఒకసారి ఆలోచించండి. ఆడవారికైనా, మగవారికి అయినా సదుపాయం ఉంటుందా. ఉండదు కదా. అందుకనే వెనుకభాగం అయిన పడమర దిశలో ఈ లెట్రిన్, బాత్‌రూమ్‌లు నిర్మాణం చేయాలి. ఇది ప్రాచీన పద్ధతి. మరొక విషయం... నిత్యంలోచేసే పనులలో మగవారి కార్యకలాపాలకు ఆడవారి కార్యకలాపాలకు అడ్డంకులు లేకుండానే ఈ నిర్ణయం చేశారు. ఎక్కడా అవసరాలను దృష్టిలో ఉంచుకునే విషయాలు చెప్పారు కానీ పొరపాటుగా కూడా తేడా చెప్పలేదు. గమనించండి. వెదుతున్న కొద్దీ మీకే అర్థం అవుతుంది. మరొక ముఖ్య విషయం. పూర్వం లెట్రిన్ నిర్మాణాలు ఎలా జరిగేవో తెలుసా? లెట్రిన్ కమోడులు లెట్రిన్ పైప్‌లు మనకు ఎప్పటి నుంచి తెలుసు? మీరెప్పుడైనా గమనించండి. 1980ల వరకు గోదావరిజిల్లాలోని పల్లెల్లో కూడా ప్రాచీన విధానంలోనే లెట్రిన్ నిర్మాణం జరిగినది. చరిత్ర, కాలంలో వచ్చే మార్పులు కూడా తెలుసుకుని ఏ శాస్త్రం చదివినా మనకు అవగాహన బాగా పెరుగుతుంది. అది ఎలాగ అంటే ట్యాంక్ తవ్వి, దాని మీదనే లెట్రిన్ నిర్మించే వారు. అలాగే లెట్రిన్, లెట్రిన్ ట్యాంక్ రెండూ ఒకేచోట ఉండేవి. మరి ఈ పద్ధతి ప్రకారం 'దైతే యాంతకయో పురీష సదనం' అని కాలామృత కారుడు చెప్పిన దాని ప్రకారం దక్షిణ నైఋతిలో కూడా లెట్రిన్ ట్యాంక్ తవ్వవచ్చు. ఈ లెట్రిన్, లెట్రిన్ ట్యాంక్, బాత్‌రూమ్‌ల విషయంలో ఏ విధమైన సమస్య లేకుండా ప్రాచీనులు చెబితే అనవసర విషయాలు, ఆధునికులు చెప్పి, దాన్ని అపహాస్య ధోరణికి తీసుకు వచ్చారు. ప్రాచీనులు మాత్రం సిస్టమాటిక్ స్టడీని అందించారు.

## దిక్సూచి

దిక్సూచి అవసరం ఎంతవరకు అనేది ఆలోచన ఆధునికులకు తెలియదు అని చెప్పడంలో ఏ మాత్రం సంకోచించనవసరం లేదు. వారికి పూర్తి దిక్సూచి ఆధారంగా స్థలమును సరిచేసుకోవాలా? లేక పూర్తి రోడ్‌ను ఆధారం చేసుకుని నిర్మాణం చేయాలా? ఈ అవగాహన లేక నిర్మాణములు చేయిస్తున్నారు.

గ్రామ, నగర రచన దృష్ట్యా ప్రాచీన వాస్తు ఏర్పడినది.

సాధారణంగా ప్రధాన రహదారిని అనుసరించి, నగరాలలోను, గ్రామాలలోను రాజవీధుల నిర్మాణం జరుగుతోంది. గ్రామ, నగర నిర్మాణములు చేయునపుడు రాజవీధులను 90° తూర్పుగా దిక్సూచి ఆధారంతో ఏర్పాటు చేస్తే, మనకు ఏ విధమైన అనుమానములు ఉండవు. అంటే అర్థం దిక్సూచికి సరిచేసి రాజవీధులను ఏర్పాటు చేయాలి. అలా చేయకపోతే రాజవీధితో ఉండే దిశా దోషములే గృహములకు ఏర్పడతాయి. తద్వారా గ్రామం అంతా దిగ్దోషంతో కూడుకుని ఉంటుంది.

వాస్తు (ప్రాచీనవాస్తు)లో రెండు విధాలుగా చెప్పారు. మార్గ శోభ చెడకుండా గృహ నిర్మాణం చేయమని, లేని ఎడల శుద్ధ తూర్పు 90°కు సరిచేసి, గృహ నిర్మాణం చేయమని తెలిపారు. మార్గశోభ చెడకుండా అంటే అర్థం ఆ వీధిలోకి వారంతా ఒకే దిశను హద్దుగా నిశ్చయం చేసి, గృహ నిర్మాణం చేపట్టాలి. కొందరు దిక్సూచి ఆధారంగా కొందరు రాజవీధిని ఆధారంగా చేసుకుని నిర్మాణం చేస్తే, గృహ సముదాయంతో రాజవీధి శోభ పాడవుతుంది.



రాజవీధి దిక్సూచితో సమానంగా లేదు.

అనగా శుద్ధ ప్రాక్ దిక్సూచి ఆధారంగా నిర్మాణం చేయాలి. లేదా రాజవీధిని అనుసరించి నిర్మాణం చేయమనే శాస్త్ర ప్రాచీనులు తెలిపారు. పై పటం చూడండి. స్థలం (1), స్థలం (2) వారు రాజవీధిని ఆశ్రయించి, గృహ నిర్మాణం చేశారు. అందుచేత అక్కడ వారికి శోభ బాగానే ఉన్నా,





స్థలం(3) వాడు దిక్సూచికి సరి చేసిన కారణంగా స్థలం (3) దగ్గర మార్గశోభ చెడినది. మార్గశోభ అన్నా, లేక పంక్తిశోభ అన్నా ఒకటే. దీని వలన ఆ రోడ్‌లో ఒకరు వెనక్కి, ఒకరు ముందుకి కట్టవలసి ఉంటుంది. దీని మూలంగా అందమైన గ్రామ నగర నిర్మాణం కూడా జరిగే అవకాశం లేదు.

మరొక ముఖ్య విషయం ఇక్కడ గమనించండి. స్థలం (3) వాడు దిక్సూచికి సరి చేసిన కారణంగా స్థలం చుట్టూ (ఎ,బి,సి,డి) ఖాళీలు ఏర్పడినవి. అందువలన ఆ ఖాళీ స్థలాల వలన వచ్చే చికాకులు నేను మీకు పుస్తకం ద్వారా చెప్పడం, మీరు ఒప్పుకోవడం లేదా, ఒప్పుకోకపోవడం వీటి కంటే మీరే మిగులు స్థలాల (ఎ,బి,సి,డి) వంటి వాటి వలన వచ్చే చికాకులు, అలా ఏర్పాటు చేసుకున్న గృహ యజమానిని అడిగి తెలుసుకోండి ప్రస్తుతం కూడా అవి గోచరమవుతున్నవి.




ఇప్పుడు మీకు అర్థం అయినదా? ఇంటి పారులు, సమాంతర వెనుగాడి కోసం ప్రాచీనులు ఎందుకు వెంటబడ్డారో. మరొక విషయం. స్థలాలు దీర్ఘచతురస్ర, చతురస్ర ఆకృతులు లేకపోతే వచ్చే నష్టాలు కూడా ఇవే. స్థలం(1) వాడికి ఆగ్నేయం పెరిగి స్థలం(2) కు స్థలం(1) కి మధ్య ఖాళీ వచ్చింది. ఇలాగే స్థలం(2)కు నైఋతి పెరిగి స్థలం(3)కు స్థలం (2)కు మధ్య ఖాళీ ఏర్పడింది. వెనుక వైపు ఖాళీ రోడ్డువైపుకు కనబడక పోయినా, ముందువైపు కనబడి, ఎంత అసహ్యంగా ఉంటుందో గమనించండి. విశ్వకర్మ వంటివారు 'చతురస్రామహాధన్యా' అని చెప్పారు. చతురస్రం అంటే నాలుగు కోణాలు సమానంగా ఉంటేనే కదా? మరి పెరుగుదల ఏమిటి? వారు కూడా ఒప్పుకోలేదు. మార్గశోభ దృష్ట్యా నాలుగు కోణాలు సమానంగా ఉండే స్థల ఎంపికయే నిజం. అభివృద్ధి పథం, గ్రామ రచనకు యోగ్యం. అయితే మూర్ఖులు ఈ రోజుల్లో ఉన్నట్లే ఆ

రోజులలో కూడా ఉండేవారు కాబట్టి వారిని బెదిరించి అయినా చక్కటి నిర్మాణం చేయించాలి అనే ఉద్దేశ్యంతోనే ఈ పని చేశారు.

గమనిక : స్థలంలో పెరుగుదల తరుగుదల అనేవి గ్రామ, నగరాలకు సంబంధించిన అంశం. అందుకే వారు అలా చెప్పారు. గుర్తుంచుకోండి. గదుల నిర్మాణం, ఇంటి నిర్మాణం ఇలా చేసుకో అని చెప్పారు కానీ ఫలితాలు చెప్పలేదు. పబ్లిక్‌కు సంబంధించిన విషయాలనే వారు ఫలితాలతో కూడి శలవిచ్చారు.

**దిక్సూచి విషయానికి వస్తే...**

పురారంభే గృహారంభే గోపురారంభ కర్మణి
గర్భ గృహ విమానాది సద్వాస్తుషు శుభావహః
ప్రాసాదే సదనే లిందే ద్వారే కుండే విశేషతః
దిఙ్మూఢే కుల నాశస్స్యాత్ తస్మాత్సం శోధయే ద్దిశః

పురము అనగా పట్టణము. పురములు, గృహ, గోపుర, గర్భ, విమానాదుల నిర్మాణముల యందు సద్వాస్తు అంటే మంచి వాస్తు అమలు జరిగితే శుభ ఫలితాలు ఉంటాయి. అయితే రాజగృహము, దేవ గృహము, వసారాలు, ద్వారము, అగ్నిహోత్ర గుండము వంటివి నిర్మాణము చేయునప్పుడు శుద్ధ ప్రాక్ దిశను సాధించి, నిర్మాణము చేయవలెను. లేని ఎడల కులనాశనం జరుగును. శాస్త్రం మీద అతిభక్తితో ఉన్న వారు, శాస్త్రం సరిగా తెలిసీ తెలియని వారు ఇరువురూ ఎప్పుడూ ఉంటూనే ఉంటారు. అందుకే వారు ఈ విషయాలు శెలవిచ్చారు. శాస్త్రం మీద అతిభక్తి ఉన్నవారు పూర్తిగా అధ్యయనం చేసి గానీ లేక పూర్తిగా అధ్యయనం చేసిన వారి ద్వారా కానీ ఫలితాలు, ప్రయోగాలు తెలుసుకుంటారు. అయితే అర్ధ పండితులే తగల బెడుతూ ఉంటారు. అందుకే పై శ్లోకంలో ద్వారం, అగ్నిగుండం కూడా ఉదహరించారు. దీనిని గూర్చి తర్వాత వివరిస్తాను. ఒక వేళ దిక్సాధన చేయము. ఏమవుతుంది అంటే...

ఆర్జవేన విహీనశ్చ కర్తరీ కృతమేవచ
శాస్త్ర విశ్చిల్ప కారయజ్ఞః కారయేన్న కదాచన

వ్యాఖ్యానం : ఏకస్యామేవ వీథ్యాం పంక్తి శోభానర్థమ్, ఆర్జవాధి రహితమ్ చన కారయే దిత్యుపదేశః అని ఉన్న కారణంగా దిక్సాధన ఎంత అవసరమో





పంక్తి శోభ చెడకుండా ఉండడం కూడా అంతే అవసరం. అందుకే అందరితో కలసి అయితే దిక్సూచి ప్రకారం లేదా రాజవీధిని ఆశ్రయించు కుని నిర్మాణం చేసుకోమని చెప్పారు.

**రెండు మాటలు వారే చెప్పినప్పుడు ప్రాచీనులను విమర్శించవలసిన అవసరం లేదు.**

దిక్సూచి అంశం కూడా సైంటిఫిక్ స్టడీ మాత్రమే.

ఇక పైన ద్వారం గూర్చి ఎందుకు తెలిపారో చూద్దాం...

ఇల్లు ఈశాన్యానికి తిప్పడం గూర్చి ఇప్పుడు మనం ఎక్కువగా వింటున్నాం. అయితే ప్రాచీనులు **'ముక్తి కామస్య కరణే శుద్ధ ప్రాచీం ప్రయోజయేత్'** ముక్తిని కోరుకునే వారికి ఆధ్యాత్మిక జీవనం గడిపే వారికి శుద్ధ ప్రాచీ అనగా $90^0$ తూర్పు తీసుకుని గృహ నిర్మాణం చేయాలి. **'ఐశాన్య ప్రాచీస్సర్వస్య భోగకామస్య సమ్మతా'** ఈశాన్య ప్రాచీ అనగా ఈశాన్యమునకు తిప్పి గృహ నిర్మాణం చేయుట వలన సర్వభోగములు అనుభవించే అవకాశం ఉన్నది అని చెప్పి, ఈశాన్యం తిప్పడం అంటే **'ప్రాగంక ముత్తరే కించిన్నీత్వా సైశీతి కథ్యతే'** అనగా, మొదట శుద్ధ ప్రాక్ సాధించి, తర్వాత మార్కింగ్ పూర్తి చేసి, అందులో ఈశాన్య పుల్లను (పిల్లర్‌ను) కొంచెం అనగా తెలిసీ తెలియనట్లు ఉందు విధంగా తూర్పు ఉత్తరాలకు జరుపమన్నారు. అయితే నిర్మాణం విషయంలో చతురస్రా మహాధన్యా అని చతురస్ర దీర్ఘ చతురస్ర కట్టుబడులకే ప్రాముఖ్యం ఇచ్చారు. ఎక్కువగా ఈశాన్యం తిప్పితే ఏమి అవుతుంది అంటే ద్వారాలు ఆగ్నేయం వాయవ్యం చూస్తాయి. శుద్ధ ప్రాక్ అంటే 90 డిగ్రీలు లేదా రాజ వీధితో సమాంతరంగా అని అర్థం చేసుకోండి.



స్థలం (1) అతిగా ఉత్తరం ఈశాన్యం పెరిగిన స్థలం. తత్ఫలితం గేటు వాయవ్యాన్ని చూచును. స్థలం (2) అతిగా తూర్పు ఈశాన్యం పెరిగిన స్థలం. తత్ఫలితం గేటు ఆగ్నేయాన్ని చూచును. అతిగా స్థలం పెరిగిన మీద మనం గృహ నిర్మాణం చేస్తే అది చూడడానికి కూడా చికాకుగానే ఉంటుంది. అందుకే ఈశాన్యం కూడా కొంచెమే పెరగాలి అని చెప్పారు. అలాగే అగ్నిగుండం గూర్చి చెప్పారు. అది ఎందుకు అంటే ఇల్లు, రాజవీధి రెండూ 90°కు ఉన్నప్పుడు ఎటువంటి ఆలోచన చేయనవసరం లేదు. కానీ ఒకవేళ ఇల్లు రాజవీధిని ఆశ్రయించి కడిత అగ్నిగుండం కట్టవలసి వచ్చినపుడు 90°లకు కట్టాలా? లేదా? అంటే అటువంటి సమయంలో కూడా అగ్నిగుండం రాజవీధిని అనుసరించి ఉన్న దిక్కులను ఆధారం చేసుకుని నిర్మించాలి. ఇది ప్రాచీనుల పద్ధతి. దిక్సూచి వాడకం తెలిసింది కదా! అని దిక్సూచి ప్రకారం అగ్నిగుండం కట్టకూడదు. ఇటువంటి ఎన్నో మతాంతర పాఠాలతో మనవారు ప్రాచీన వాస్తు శాస్త్రం అందించారు. అగ్నిగుండమే కాదు, ఇంట్లో బీరువా, మంచం, దేవుడు మందిరం, వంట అన్నీ కూడా అయితే రాజవీధి దిశ లేకపోతే 90° దిక్‌సాధన. వీటిని మాత్రమే వాడమని చెప్పారు.

దిక్సూచి, దిక్సాధన
స్థలంలో హెచ్చు తగ్గు
ఇల్లు ఈశాన్యం తిప్పడం
ఇంట్లో వస్తు అమరిక

ఇవన్నీ కూడా కేవలం పంక్తిశోభ, మార్గశోభను దృష్టిలో ఉంచుకుని ఏర్పాటు చేశారు. అంతే కానీ ఎలాగ పడితే అలాచెప్పలేదు అనే విషయం గమనించండి. కాబట్టి దిక్సాధన అనేది స్థలాలలో హెచ్చు తగ్గులు అనేది కూడా సిస్టమాటిక్ స్టడీ మాత్రమే.

## ఒకే ప్రాంగణంలో రెండు ఇళ్ళు

ఒకే ప్రాంగణంలో రెండు ఇళ్ళు కట్టాలి అంటే ఆ రెండుఇళ్లకీ మధ్య కొంత ఖాళీ ప్రదేశం వదలాలి. ఖాళీ ప్రదేశమునకు కూడా ఒక సిద్ధాంతం ప్రకటించార్కు. అది ఏమిటో చూద్దాం. ఇంటి ఎత్తు ఎంత





ఉంటుందో, అందులో సగం వదలాలి అని. ఇంటి ఎత్తు 12 అడుగులు అనుకోండి. రెండు ఇళ్ల మధ్య ఆరు అడుగులు వదలమన్నారు. ఇల్లు ఎత్తు 24 అడుగులు అనుకోండి. 12 అడుగులు వదలాలి. దీనిలో చాలా సైంటిఫిక్ రీజన్ ఉన్నది. అది ఏమనగా ఇళ్ల మధ్య ఖాళీ ప్రభావంగా గాలి లోపలకు రావచ్చు కానీ వెలుతురు, సూర్యరశ్మి ప్రసరణ కష్టం.

నేను చెప్పాను కదా? అని మీరు నమ్మవద్దు. ఐదు అంతస్తులు ఆరు అంతస్తుల ఎత్తు ఉన్న అపార్ట్‌మెంట్‌లకు వెళ్లండి. వాటి మధ్య ఒక వేళ ఖాళీ తక్కువగా ఉంటే పరిస్థితి గమనించండి. గాలి వచ్చే అవకాశం ఉంటుంది. కానీ వెలుతురు, సూర్యరశ్మి తక్కువగానే ఉంటాయి. కారణం ఎప్పుడయితే ఖాళీ తగ్గిందో, సూర్యుడు నడినెత్తి మీదకు వచ్చే వరకు కూడా ఆ ఖాళీలోకి సూర్యరశ్మి ప్రసరించదు. తద్వారా ఇంట్లోకి కూడా సూర్యరశ్మి ప్రసరించదు. అందుకే రెండు ఇళ్ల మధ్య ఖాళీ ఇలా ఉంచమని, ఏకాశీతిపద మండల వాస్తు ప్రకారం 1/9 వంతు ఇంటి చుట్టూ ఖాళీ ఉంచమని తెలిపారు. మరి ఇది సైంటిఫిక్ రీజన్ అవునా? కాదా? అనేది పాఠకుల విజ్ఞతకే వదిలి వేస్తున్నాను.

## ఈశాన్యంలోనే శంఖుస్థాపన చేయాలా?

చేయాలి... కారణం ఏమిటి అంటే నైఋతిలో మూలమట్టం వేయడం అనే అలవాటు కన్‌స్ట్రక్షన్ యాక్టివిటీలో ఉన్న అందరికీ ఉన్నదే. అయితే నేడు టెక్నాలజీలో అభివృద్ధి ఉన్న కారణంగా కట్టుబడి కూడా అవకాశాన్ని బట్టి చేయవచ్చు. పూర్వ పిల్లర్ కన్‌స్ట్రక్షన్ లేదు. మనం ఇల్లు కట్టుకుందాం అనుకునే నమూనా భూమి మీద మార్క్ చేసి, ముగ్గు వేసి అప్పుడు పునాదులు తవ్వడం మొదలు పెట్టాలి. పూర్వులు అలాగే చేసేవారు.

ముఖ్య గమనిక : మూలమట్టమునకు సరిపోని, కట్టుబడిని వాస్తుశాస్త్రమే కాదు, మోడరన్ ఆర్కిటెక్చర్ వారు కూడా ఒప్పుకోరు. మూల మట్టానికి సరిపోకపోవడం అంటే ఏమిటి? ఈశాన్య, నైఋతి, ఆగ్నేయ, వాయవ్య దిశలలో తరుగుదల పెరుగుదలలు ఉంటే మూలమట్టం సరిపోదు. మన ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు దానికో ఫలితాన్ని నిర్దేశించారు. అయితే సివిల్

ఇంజనీరింగ్ రూల్స్ ప్రకారం కచ్చితంగా మూలలు సరిపోయి, మూల మట్టానికి సరిపోయి విదిక్కుల పెరుగుదల, తరుగుదల ఉండకూడదని మాత్రమే చెప్పారు. సివిల్ ఇంజనీరింగ్ + ప్రాచీన వాస్తు ఈ రెంటి ప్రకారం చతురస్రా మహాధన్యా అనేదే కరెక్ట్. కాబట్టి మీరు గదిలో నైఋతి పెరిగితే ఏమవుతుంది (కట్టుబడిలో) గదిలో ఆగ్నేయం పెరిగితే ఏమవుతుంది అనే విషయం వాస్తు శాస్త్రజ్ఞులనే అడగనవసరం లేదు. మీరు ఇంజనీర్‌లను కూడా అడగవచ్చు.

ఈ నియమాల కోసమే నైఋతిలో మూలమట్టం వేసే అలవాటు ఉంది కదా? ఆ ఆలవాటు ప్రకారం నైఋతికి వ్యతిరేక దిశ అయిన ఈశాన్యంలో కట్టుబడి ప్రారంభిస్తే నైఋతి దిశ వచ్చే వరకు మూల మట్టం కదల్చనవసరం లేకుండా మధ్య మధ్య చెక్ చేసుకునే అవసరం ఉంటుంది. ఇదే నైఋతిలోనే ప్రారంభిస్తే పునాదులు తవ్వే సమయంలో అనుమానం వచ్చినప్పుడు చెక్ చేసే అవకాశం ఎక్కడ నుంచి ఉంటుంది? మీకొక అనుమానం రావచ్చు. చతురస్రం అంటే అన్ని మూలలు ఒకటే కదా? నైఋతిలో కట్టుబడి ప్రారంభించి, తర్వాత ఈశాన్యంలో మూలమట్టం చెక్ చేయవచ్చు కదా? అని.

ఇలా విచిత్ర ప్రశ్నలు వేస్తే, దానికి మొరటుగానే సమాధానం చెప్పవలసి ఉంటుంది. ప్రతి పనికీ ఏదో ఒక చోట ప్రారంభం చేయవలసిన అవసరం ఉన్నది. కాబట్టి నైఋతిలో మూలమట్టం ఈశాన్యంలో పని ప్రారంభం చేయడం అనే అలవాటు చేశారు. ఈశాన్యంలో పని ప్రారంభించే అలవాటు ఉంది కాబట్టి, మరియు పని ప్రారంభమునకు పూజ చేయు అలవాటు ఉన్నది కాబట్టి ఈశాన్యంలోనే శంఖుస్థాపన చేసే అలవాటు కూడా చేశారు.

## స్థల నిర్ణయం

**దేవాలయ, శ్మశాన, మంత్రి నివాస, చతుష్పథం దగ్గర స్థలాలు నిషేధం**

స్థలం ఎంచుకునే విషయంలో మనకు ప్రాచీనులు ఎన్నో విషయాలు తెలిపారు. అవి అన్నీ కూడా ప్రశాంత జీవనం చేయడం కోసం ఏర్పాటు





చేసిన నియమములే. అందులో భాగంగా మనం దేవాలయం విషయం పరిశీలిద్దాం.

యావచ్ఛావతరే ఛాయా తావతీ దోష భూమికా
దోష భూమిం పరిత్యజ్య నివాసం పరికల్పయేత్॥

అనగా దేవాలయముల నీడ ఎంత వరకు పడునో అంత వరకు దోష యుక్తమైన భూమిగా పరిగణించాలి. ఆ విధంగా దోషప్రదంగా పరిగణింపబడిన భూమిని వదిలి వేసి, నివాసం ఏర్పాటు చేసుకోవాలి. అలా కాకపోతే **'శతదండాంత త్యక్త్వానే వసతిం జగుః'** దేవాలయ ప్రాకారం నుండి వంద అడుగుల వరకు భూమిని వదిలి, ఆ తర్వాత నివాసములు ఏర్పాటు చేసుకోవాలి.

ఇవన్నీ ఎందుకు ఏర్పాటు చేశారో తెలుసా? కేవలం దేవాలయం దగ్గర్లో రద్దీ ఎక్కువ ఉంటుంది. ఉత్సవాలు జరిగేటప్పుడు కూడా దేవాలయం చుట్టూ ఖాళీ ఉంటే, అక్కడ కార్యక్రమ నిర్వహణలో దేవాలయం సిబ్బందికి ప్రశాంతత ఉంటుంది.. మరియు ఆ ఉత్సవ సమయాలయందు దేవాలయం చుట్టూ నివాసం ఉండే ప్రజలు కూడా ఇబ్బందులు పడకుండా ఉంటారు. ఈ ఉద్దేశ్యంలో శ్మశాన విషయం కూడా చర్చకు తెచ్చుకోవచ్చు.

శ్మశాన భూసమీప స్థాతుష భారస్సు మన్వితా
కంపేన భేదితా భూమి రగ్ని దగ్ధాచ సర్వశః

శ్మశానమునకు సమీపమున ఉన్న భూమి, ఊకతో ఎక్కువగా నిండిన భూమి, భూకంపం, పిడుగుల వలన బీటలు వారిన భూమిని నివాసానర్హ భూమిగా పరిగణించాలి. ఇందులో సైంటిఫిక్‌గా కూడా భూకంపం, పిడుగు వలన బీటలు వారిన భూమి నిర్మాణార్థం పనికిరాదు. ఆ ప్రదేశాలలో నివాసం అనుకూలం కాదు. అయితే శ్మశానం విషయంగా నివాస వసతిని పరిశీలించి ఆ నిర్ణయం తెలిపారు అనుటలో సందేహం లేదు. శ్మశానం దగ్గర్లో ప్రేతను కాల్చినప్పుడు పొగ ఎంత వరకు పారునో అంతవరకు నివాసానర్హ భూమిగా పరిగణించారు. అంటే అది వసతులను గమనించి చేసిన నియమం అని ఎలా కాదంటారో చెప్పండి. శ్మశానం

దగ్గర ప్రశాంతత ఉంటుందా? ఇదే రీతిలో సైంటిఫిక్ నిర్ణయాలు, వసతికి సంబంధించిన నిర్ణయాలు అన్నీ గమనించి, చేసినదే ప్రాచీన వాస్తు శాస్త్రం. ప్రశాంత నివాసం ఏర్పాటు చేసే లక్ష్యంలో భాగంగా

చతుష్పధ మహావృక్ష దేవమంత్రి నివాసితామ్
దూరాద్రాశ్రితాంచ భూగర్త యుక్తాం చైవ విసర్జయేత్

చతుష్పథం దగ్గర నివాసం అసలు ప్రాచీనులు ఒప్పుకోలేదు. చతుష్పథం అంటే నాలుగు రోడ్ల కూడలి. నాలుగు రోడ్ల కూడలి అంటే కొంచెం జనాభా ఎక్కువగా తిరిగే సెంటర్. మరీ జనాభా రద్దీ ఎక్కువ ఉన్నచోట హడావిడి ఎక్కువగా ఉంటుంది. హడావిడి ఎక్కువ ఉన్న చోట ప్రశాంతత తక్కువగా ఉంటుంది. అందుకే ప్రశాంతత లోపించే అవకాశం ఉన్న చతుష్పథం నివాసానర్హ భూమిగా ఎంపిక చేయబడినది. చతుష్పథం దగ్గర కూడా బ్లాక్‌లు వస్తాయి. నాలుగు బ్లాక్‌లు ఉంటాయి. నైఋతి, ఈశాన్య, వాయవ్య, ఆగ్నేయం. అయితే నేటి ఆధునికులు ఆగ్నేయ బ్లాక్ మంచిదికాదు. ఈశాన్య బ్లాక్ మంచిది. ఇలా బ్లాక్‌ల గురించి పుస్తకాలు వ్రాస్తున్నారు. మరి విశ్వకర్మ తెలివిగా అసలు చతుష్పథ నివాసమే వద్దన్నారు. ఇక్కడ ఈ విషయాన్ని ఆస్తిక, నాస్తిక వాదులు అందరూ కూడా గమనించి ఏ ఆధారంతో ఈ సిద్ధాంతం ఆధునికులు తెలిపారో పరిశీలించండి. తూర్పు, దక్షిణంరోడ్ ఆగ్నేయ బ్లాక్, తూర్పు, ఉత్తరం రోడ్ ఈశాన్య బ్లాక్, పడమర, దక్షిణం రోడ్ నైఋతి బ్లాక్, పడమర ఉత్తరం రోడ్డు వాయవ్య బ్లాక్, తూర్పు నుంచి పడమర వరకు, ఉత్తరం నుండి దక్షిణమునకు వెళ్లే రోడ్లు కలిసే సెంటర్‌ను చతుష్పథం అంటారు.

మహా వృక్షాలు అనగా రావి, మేడి, జువ్వి, మర్రి వంటి వాటి దగ్గర్లో నివాసం ఉంటే పునాదులకు, గోడలకు రక్షణ తక్కువ. అంతే కాక త్వరగా ఫ్లోరింగ్ కూడా పాడువుతుంది. ఈ దృష్ట్యా వారు మహా వృక్షాలకు దూరంగా ఉండమన్నారు.

మంత్రుల ఇళ్లకు దగ్గర్లో కూడా నివాసం వద్దని శాస్త్రం. మంత్రుల ఇళ్ల దగ్గర ఎప్పుడూ రద్దీ ఉంటుంది. దాడులు జరిగే అవకాశాలు ఉన్నాయి. ఇవి నేటి మన సమాజంలో మనమూ చూస్తున్నాము. ఈ నేపథ్యంలో





ప్రశాంత జీవనం వదిలి, మంత్రి గారి పక్కన బిక్కుబిక్కుమంటూ శబ్ద కాలుష్యంతోను, అశాంతితోను ఎందుకు నివాసం ఏర్పాటు చేసుకోవడం? ఒకసారి ఆలోచించండి.

## మరికొన్ని ముఖ్య విషయాలు....

గ్రామంతో సంబంధం లేకుండా దూరంగా నివాసం ఉండవద్దు అన్నారు. ఇందులో తప్పేమిటి? ఏ అవసరం వచ్చినా ఎక్కడకు వెళ్లాలి? దూరంగా ఉంటేరక్షణ ఏమిటి? నలుగురితో నారాయణ అంటే లాభం ఉందా? లేదా? ఒకసారి ఆలోచించండి.

పైకి కనబడకుండా లోపలకు బొరియలు ఉన్న భూమి నివాసానర్హ భూమి. దీని వలన భూమి యొక్క గట్టిదనం త్వరగా తేలదు. కావున అలాంటి భూమి నివాసానర్హం భూమిగా తెలిపితే తప్పా?

ఇవే కాక నది ఒరిపిడి గల భూమి మూర్ఖులను కలిగించును. 'నదీ ఘాతాశ్రితా మూర్ఖాన్' మూర్ఖులు కాకపోతే ఇంక ఎవరు నది ఒరిపిడి గల ప్రదేశాలలో నివాసానికి ధైర్యం చేస్తారు. నది ఒరిపిడి గల భూమిలో నివాసం కేవలం సామాన్య మానవుడి వలన అవ్వదు. ఇలా ఎన్నో విషయాలు మనకు తెలియజేసినవి మన శ్రేయస్సుకోరి చేసినవే. మనం వాటిని అర్థం చేసుకోవడంలో ఉంటుంది. మనకు కేవలం అపహాస్య ధోరణి తప్ప వేరొకటి లేకపోతే ఇందులోని ఆంతర్యం మనకు గోచరించదు. రాళ్ళు అధికంగా ఉన్న ప్రాంతంలో నివాసం వద్దని సూచన ఉన్నది. అయితే ఈ మాట ఎందుకు చెప్పారు అంటే మనిషి జీవనానికి నీరు బాగా అవసరం. రాళ్లు అధికంగా ఉన్న భూమిలో నీటి సదుపాయం ఏర్పాటు చేసుకోవడం కష్టం అవుతుంది. అందువలన రాళ్లు అధికంగా ఉన్న భూమిని నివాసానర్హ భూమిగా ఏర్పరచారు.

ధర్మార్థ కామ మోక్షాఖ్య పురుషార్థ ఫలసిద్ధయే
శీతావాతాది రక్షార్థం వాస్తు పూర్ణ గృహీభవేత్

ధర్మ, అర్థ, కామ, మోక్షములు అనే వాటి పురుషార్థ సిద్ధికీ, శీతోష్ణాదులు నుండి రక్షణ కోసం, గృహ నిర్మాణం చేసుకోవాలి అనే ఉద్దేశ్యంతోనే వాస్తు శాస్త్రం నిర్మాణం అయినది. అందులో భాగంగా ఎక్కువ వేడిని

ప్రదర్శించే నేలను, నీరు దొరకని నేలను వదిలివేయమని చెప్పారు. ఎడారులు, పర్వతాలు వంటి వాటిలో కూడా నిర్మాణం వద్దని శాస్త్రం చెప్పినది. అందరూ కలసి ఒకచోట గుంపుగా చేరి, కొండల మీద గిరినగరం నిర్మాణం చేయదలిస్తే దానికి ఆమోదం తెలిపినది.

## మెట్లు

మెట్ల విషయంలో ఎవరూ మార్పు చేయలేని అపోహ సమాజంలో ఉన్నది. అది ఏమిటి అంటే ఈశాన్యంలో మెట్లు ఉండకూడదు అని ఈ విషయం ఏ మహర్షి చెప్పారు? ఏ గ్రంథంలో చెప్పారు? అంటే సమాధానం లేదు. ప్రాచీన గృహములు, రాజభవనములు పరిశీలిస్తే వాటిలో ఈశాన్య భాగంలో మెట్లు మనకు గోచరమవుతాయి. ఆధార గ్రంధాలలో ఎక్కడా కూడా ఈశాన్య మెట్లు ఉండకూడదని వ్రాసి లేదు. కానీ సమాజం మాత్రం ఈశాన్యం మెట్లు పెట్టుకోమని చెప్పిన సిద్ధాంతిని వాస్తు తెలియని సిద్ధాంతిగా అభివర్ణిస్తున్నారు. ప్రాచీన శాస్త్రజ్ఞులు మెట్ల నిర్మాణం విషయంలో దిశా నిర్దేశం చేయలేదు. ఈ ఆధునికులు మాత్రం ఆగ్నేయంలో అయితే ఇదీ ఫలితం, నైఋతిలో అయితే అదీ ఫలితం, వాయవ్యంలో అయితే ఇదీ ఫలితం. ఈశాన్యం అసలు వద్దు అని అనేక రకాలైన సూచనలు చేశారు. పూర్వీకులు ఈశాన్యం మెట్లు పెట్టారా? లేదా అనే విషయంలో మీకు అనుమానం తీరాలి అంటే ప్రాచీన రాజభవనాలు ఇప్పటికీ ఉన్నాయి. వాటిని సందర్శించండి. మీకు తెలుస్తుంది. ఈ విషయం గమనిస్తే మనం ప్రాచీన వాస్తు గూర్చి అపహాస్యంగా మాట్లాడవచ్చా? లేదా? అనే విషయం మీకే తెలుస్తుంది.

## బావి

బావి, బావి దగ్గర నీటి వాడకం తద్వారా నీరు బైటకి పోవడం ఇవి పబ్లిక్‌ను దృష్టిలో ఉంచుకుని చేయాలి. మన స్థలమే కదా అని ఇష్టం వచ్చినట్లు కడితే పక్కింటి వారికి వాతావరణ కాలుష్యం, పారిశుద్ధ్య కాలుష్యం అనేవి వస్తాయి. ఇవి కలగకుండా ఉండడం గురించి ఆలోచించి ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు బావి తవ్వుకునే ప్రదేశాలు నాలుగు చోట్ల





చెప్పారు. బావి ఈశాన్యంలోనే తవ్వాలా? లేకపోతే ఏమవుతుంది అని నాస్తిక వాదన. బోరింగ్ లేదా బావి ఈశాన్యంలో మాత్రమే ఉండాలి అని ఆధునికులు చేసిన వాదన. అయితే ప్రాచీనులు ఏమని చెప్పారో చూద్దాం. ముందుగా ఒక సైన్స్ విజ్ఞాన విషయం తెలుసుకోండి. లెట్రిన్ బావులకు, బావులకు కనీస దూరం ఉండేలాగా చేయాలి అనేది విజ్ఞాన శాస్త్రం (సైన్స్). మరి ఏకాశీతిపదమండల వాస్తు ప్రకారం స్థలం చుట్టూ 1/9 వంతు నిర్మాణాలు చేయకుండా ఉండాలి. ఈ నియమాలలో భాగంగా 'దైతేయాంతకయోః పురీషసదనం' అని చెప్పారుకదా. దక్షిణ నైఋతి మధ్య లెట్రిన్ (ట్యాంక్) నిర్మాణం కదా చెప్పినది. ఇప్పుడు పటం గూర్చి చర్చించండి.

| | |
|---|---|
| తూర్పు<br>బావి<br>ఇల్లు-1<br>లెట్రిన్ | తూర్పు<br>బావి<br>ఇల్లు-1<br>లెట్రిన్ |
| తూర్పు<br>బావి<br>ఇల్లు-1<br>లెట్రిన్ | తూర్పు<br>బావి<br>ఇల్లు-1<br>లెట్రిన్ |

ఇది ఒక గొప్ప సైంటిఫిక్ స్టడీ కాదో, అవునో గమనించండి. ఈశాన్యంలో బావి, నైఋతిలో లెట్రిన్‌లు ఎవరికీ ఇబ్బంది కలిగించని రీతిలోనే ఉన్నాయా? లేదా? ఆలోచించండి. ఇది ప్రధమంగా చెప్పి శాస్త్రకారుడు వదిలి వేయలేదు.

విశ్వకర్మ మతానుసారంగా ఇంటికి వెనుకవైపు స్త్రీల సౌకర్యార్ధం లెట్రిన్, బాత్‌రూమ్‌కు అవకాశం ఎప్పుడు ఇచ్చారో, అప్పుడే బావులు, బోరింగ్‌ల విషయం కూడా మారినది. ఇది సైంటిఫిక్‌గా చెప్పిన మాట కాపోయినప్పటికీ వెక్కిరించవలసిన అవసరం ఉన్న విషయం మాత్రం కాదు. **'పూర్వోత్తరేశాన జలేశ దిక్షుకృతం జలం సౌఖ్యసుతప్రదంచ'** అని చెప్పారు. అనగా తూర్పు, ఈశాన్య, పశ్చిమ, ఉత్తర దిశల యందు బావి తవ్వుట మంచిది అనిచెప్పారు. ఇది ఎందుకు చేశారు అంటే సౌకర్యార్ధం. మన ప్రాచీనులు సౌకర్యాలు బాగా చూసి నిర్ణయం చేసి వాస్తు శాస్త్రం చెప్పారు అనడానికి ఇదే ఒక ఉదాహరణ. మీకు మరొక విషయం చెప్పాలి.

ఆధునిక వాస్తు శాస్త్రజ్ఞులు మాత్రం ఈశాన్యంలో మాత్రమే బావి తవ్వాలి లేకపోతే అనర్ధం, పశ్చిమ దిశలో ఉండకూడదు అనే వాదనలు అధికంగా ప్రచారం చేసి, ఇలా అపహాస్యం పాలు చేశారు. ఏమండీ ఒకసారి ఆలోచించండి. ఈశాన్యంలో గేటు పెట్టమని, ఈశాన్యంలో బోరింగ్ లేదా బావి తవ్వమని ఆధునికులే చెప్పారు. నేటి సమాజంలో మనం చూస్తున్నాం. ఈశాన్యంలో బోరింగ్ తవ్వి, ఈశాన్యంలో నడక పెట్టి, ఈశాన్యంలో సంప్ తవ్వి, ఇలా చండాలం అయిన తర్వాత మరొక చండాలపు కార్యం చేస్తున్నారు. అది ఏమిటి అంటే బోరింగ్ పైన మూత వేసి, సంప్ మీద మూత వేసి అప్పుడు ఈశాన్యం గేటు నుండి నడుస్తున్నారు. ఇలాగా మనవారు ప్రాచీనులు చెప్పినది. ఈశాన్యంలో గేటు కావాలి అనుకుంటే తూర్పు లేదా ఉత్తర దిశలలో బోరింగ్, సంప్‌లు తవ్వుకోవాలి. అంతే కానీ సంప్‌ల మీద నడవకూడదు.

వాస్తుని నమ్మితే పురాణ విషయాలు నమ్మాల్సిందే. లక్ష్మీ అమ్మవారికి జన్మస్థానం నీరు. అటువంటి నీరు ఒకచోట నిల్వ ఉండి, దానిమీద నడిస్తే ఆవిడకు ఆగ్రహం రాదా? ఒకసారి ఆలోచించండి. ఇలా అక్కర్లేని





ఈశాన్య విషయాలు ప్రచారంలోకి తెచ్చి, దుష్ట వాస్తు ప్రచారం చేసి ఆధునికులు మన గౌరవ ప్రదమైన ప్రాచీన వాస్తుని అపహాస్యం పాలు చేశారు. ఒకచోట మాత్రమే బావి తీసుకోవాలి అని చెబితే ఇదేమైనా సైన్సా అని మీరు ప్రశ్నించవచ్చు. ఏకంగా బావి త్రవ్వడానికి నాలుగు స్థానాలు చెప్పి, సౌకర్యం కలుగజేశారు. అంతేకాదు, దేవాలయాల విషయంలో మరొక విషయం కూడా చెప్పారు. అది పరిశీలిస్తే, కచ్చితంగా ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞుల వాస్తు నిర్మాణం విషయంలో సౌకర్యమే ఎక్కువ ప్రధానం చేశారు అనుటలో సందేహం లేదు.

**'అష్టదిక్షు యధాయోగం తటాకం కారయేన్మహత్'** అనుట ద్వారా దేవాలయంలో ఎక్కడ మంచినీరు లభ్యం అవుతుందో, అక్కడ బావి తవ్వమని చెప్పారు. అంటే మన పూర్వులు మన సౌకర్యం ఎంతో చూశారు.

ఆధునికులు దేవాలయాల వాస్తు విషయంలో కూడా ఈశాన్య బావి, ఈశాన్య గేటు, ఈశాన్య సంపు అనే దరిద్రాన్ని అమలు చేసి, అందరి చేత వాస్తు సైన్స్ అనే అంశం చర్చకు తీసుకు వచ్చే లాగా చేశారు. ఒక్కసారి మానసారం రాజహర్మ్య నిర్మాణ విధానం అధ్యాయం చదవండి. మీకు ప్రాచీన వాస్తు శాస్త్రం మీద అభిమానం, గౌరవం పెరుగుతాయి. ఆధునిక వాస్తుమీద అసహ్యం పెరుగుతుంది.

పాఠకులకు విజ్ఞప్తి. పై అంశాన్ని బాగా పరిశీలించండి. ప్రాచీన గ్రంథాలు చదవండి. ఇంకా ఎన్నో విషయాలు బయటకు వస్తాయి. మీకు అప్పుడు వాస్తు శాస్త్రం మహర్షులు చాలా తెలివిగా చెప్పారు అని తెలుస్తుంది. బావి విషయం కూడా సిస్టమాటిక్ స్టడీగా పరిగణించవచ్చు.

## ద్వారముల అమరిక

ఇది సైన్స్ ప్రకారం జరిగినదే. కొంత అవసరాలను దృష్టిలో ఉంచు కున్నారు. ఈ విషయాన్ని పరిశీలన చేసేటప్పుడు మీరు ఒక సారి వాతావ రణం విషయాన్ని పరిశీలించాలి. ఇంటిలో చెదపురుగు రావడానికి గల కారణాలలో ఒక కారణం ఇంటిలోకి సూర్యరశ్మి రాకపోవడమే. చలిగాలి, వేడిగాలి అయినా ప్రసారం జరగకపోతే ఇంట్లో సూక్ష్మక్రిములు చేరేందుకు అవకాశం ఎక్కువగా ఉంటుంది. అందుకే మన ప్రాచీన శాస్త్రకారులు

ద్వారానికి ఎదురుగా కిటికీ కానీ, ద్వారం గానీ, అలమర గానీ ఉంచమన్నారు. అంతేకాదు ఇంట్లో ఉన్న ద్వారాలు అన్నీ కూడా రోజూ తీసి వాడవలసినదే అని చెప్పారు. ఈ క్రింద విధానం గమనించండి.


D= Door, W = Window

అన్ని ద్వారాలు తెరచి ఉంచినప్పుడు కిటికీల నుండి ద్వారాలలోకి ద్వారాల నుంచి ద్వారాలలోకి గాలి, వెలుతురు ప్రసారం అవుతుందా? లేదా? పూర్వం కరెంట్ ఫ్యాన్లు లేని రోజుల్లో పుట్టినది ఈ శాస్త్రం. శాస్త్రం చెప్పిన మహర్షులు ద్వారాలు పెట్టడమే కాకుండా ప్రతి గదికి కిటికీ కూడా తప్పని సరిగా చెప్పారు. ద్వారాలు తెరచినప్పుడు ఒక గది నుండి వేరొక గదిలోకి కూడా సూర్యరశ్మి కొంతైనా ప్రసరిస్తుంది వివిధ సమయాలలో. అలాగే తలుపులు తీసి ఉంచిన సమయం అంతా గాలి ఒక గది నుండి వేరొక గదికి కూడా ప్రసరణ జరిగే అవకాశాలు సంపూర్తిగా ఉన్నది. రక్షణ కోసం తలుపులు వేసినప్పుడు కిటికీల గుండా గాలి, వెలుతురు ప్రసరణ జరుగుతుంది.

గాలి, వెలుతురు ప్రసరణ జరుగుతుందా అనేది నేను ఈ పుస్తకంలో చూపుట కష్టం. కావున మీరు ఒకసారి తూర్పు సింహద్వారం దగ్గర వేసవిలో 'ద్వారం ఎదురు ద్వారం' ఉన్నచోట నిలబడండి. ఉదయ కాలంలో మీకే తెలుస్తుంది. ముఖ ద్వారం నుంచి మొదటి గదిలోకి దాని తర్వాత ద్వారముకు కూడా సూర్యరశ్మి ప్రసరించి తద్వారా రెండవ గదిలోకి కూడా వెలుతురు ప్రసరించడం. అలాగే సూర్యాస్తమ సమయంలో పడమర ద్వారం దగ్గర ఉండి మీరు గమనించండి. ద్వారం ఎదురు ద్వారం కానీ, కిటికీ గానీ ఉంటే దాని ద్వారా రెండవ గదిలోకి వెలుతురు ప్రసరించడం అనేది ఉన్నదా లేదా? మీకే తెలుస్తుంది.






D= Door, W = Window

నేటి ఆధునిక సమాజంలో క్రింది విధంగా ద్వారాలు, కిటికీలు ఒక పారులో లేకుండా నిర్మాణం చేయడం వలన కేవలం గాలి, వెలుతురు ఒక గదికి మాత్రమే పరిమితం అవుతాయి. కానీ ప్రాచీనులు చెప్పిన సిద్ధాంతానికి అమలు కావు. మీరొక ప్రత్యేక పరిశోధన కూడా చేయవలసిన అవసరం ఉన్నది. అది ఏమనగా చెదలు పట్టిన ఇల్లు గమనించండి. అధికంగా గాలి, వెలుతురు ప్రసరించే గదిలో ఎక్కువ చెద ఉంటుందా? లేక గాలి వెలుతురు ప్రసరణ జరగని గదిలో ఎక్కువ ఉంటుందా? ఇది ప్రత్యక్షంగా చేస్తే గానీ తెలియదు. మీరు ద్వారాల అమరిక విషయంలో. శాస్త్ర ప్రారంభ రోజులలో కరెంట్ ఫ్యాన్ వంటివి లేవని గుర్తుంచుకోండి. ఆ ఉద్దేశ్యంలో శోధించి గాలి, వెలుతురు చెద వంటివి దృష్టిలో ఉంచుకుని ఈ టాపిక్ వరకు శాస్త్రం సైంటిఫిక్‌గా చెప్పబడినదా? లేదా? అనేది మీ అంతరాత్మకు తెలియజేయండి.

ద్వారాల అమరిక విషయంలో ద్వారాలు సరిసంఖ్యలో ఉండాలి. కిటికీలు సరి సంఖ్యలో ఉండాలి అని ఎవరూ చెప్పలేదు. మహర్షులు ఈ టాపిక్‌ను స్పృశించలేదు. ఇది ఆధునికులుగా ఆధునిక వాస్తు సిద్ధాంతులుగా చెలామణి అయిన వారు చేసిన తప్పుడు ప్రచారమే. నేను నా 'వాస్తుసుధ' గ్రంథంలో కూడా ఈ విషయాన్ని అందించాను. ఇది ఆధునికులు చేసిన దుష్ప్రచారమే. దీని విషయమై నాస్తికులు ఒక ప్రత్యేకమైన చర్చలు కూడా లేవనెత్తుతున్నారు. మీ అందరికీ ఒకటే సమాధానం. ద్వార సంఖ్య ప్రాచీన వాస్తు శాస్త్రంలోనిది కాదు. విజ్ఞతతో గమనించగలరు.

# ఈశాన్య ద్వారాలు - వక్ర వాస్తు

ఆధునికులు చేసిన మరొక వాస్తు దూరమైన విషయం ఈశాన్య ద్వారాలు. ప్రతి గదికి ఈశాన్య ద్వారాలు అవసరం అని దుష్ప్రచారం చేస్తున్నారు. దీనికి నాస్తికులు కూడా ఈశాన్య ద్వారాలు పెట్టకపోతే ఏమవుతుంది అని చర్చ సాగించుచున్నారు. ఆధునికులకు, వాస్తు నాస్తికులకు ఒకటే సమాధానం. శాస్త్రంలో ఈశాన్య ద్వారాలు శాస్త్రకారులు ఒప్పుకోలేదు. కొంత అవకాశమునకు బట్టి మార్చారు. కానీ ఆధునికులు మాత్రం ఈశాన్యద్వారం తప్పని సరి అని వాదిస్తూ, ప్రాచీన వాస్తుని పాడుచేసి, ఈవిధమైన చర్చలకు అవకాశం ఇచ్చారు.




ప్రాచీన శాస్త్రకారులు ఈ విధంగా ద్వారాలు అమరిక ఉంచారు. అనగా ఆగ్నేయ నైఋతి వాయవ్యములలో కూడా ద్వారాలు ఉంచారు. దీనిలో ఒక పెద్ద అవసరం, సదుపాయం రెండూ ఉన్నాయి. ఎవరైనా ఒక వ్యక్తి సింహద్వారంలో ప్రవేశించగానే పడకగది, కార్యాలయాలలో తలుపులు ఆ సింహద్వారమునకు దగ్గరగా లేకపోవడం వలన ఆ వ్యక్తికి గది తలుపు తీసి ఉన్ననూ గదిలో కార్యం గోచరమవ్వదు. దాని మూలంగా ఒక వేళ పొరపాటున పడకగది తలుపు తీసి ఉన్నా గదిలో విషయం కనబడదు. అలాగే కార్యాలయంలో కార్యం కూడా కనబడదు. అయితే ఇందుకు భిన్నంగా నేటి ఆధునికులు దీన్ని తగులబెట్టి నిత్యం తలుపులు మూసుకు కూర్చోవలసిన స్థితి ఏర్పరచారు. తలుపులు తీస్తే అంతా బాహాటం. లేకపోతే ఎప్పుడూ దిగ్బంధనం ఇలా తగలబెట్టారు. దీనివలన అటు సంస్కారం, ఇటు వాస్తు





రెండూ తగలబెడుతున్నారు. ఆగ్నేయంలోనే వంట అని చెడు ప్రచారం, నైఋతిలో పడక, ఇదికూడా చాలా చెడు ప్రచారమే.




పక్క పటం గమనించండి. సింహద్వారంలో ప్రవేశించిన వ్యక్తికి ఒక వేళ నైఋతి బెడ్‌రూమ్ తలుపు తీసి ఉంటే మొత్తం పడకగది అంతా కనబడడమేగా? ఇదా మనకు పెద్దలు చెప్పిన వాస్తు? ఇదా మన సంస్కారం. ఈ రీతిగా ఆధునికులు పాడు చేస్తే, ఆ ఆధునిక వాస్తు శాస్త్రాన్ని చదివి, మీరు వాస్తు సైన్సా అని? అపహాస్యం చేయుట తగునా? ఇది పరిశోధించండి. వాస్తు శాస్త్రంలో ద్వారాల అమరిక విషయంలో ఆధునికులు ఈ నియమాలు పెట్టారు కానీ ప్రాచీన శాస్త్రంలో లేదు. దీనిని బట్టి ద్వారాలు పెట్టే విషయంలో ప్రాచీనులు సిస్టమాటిక్ స్టడీ అందించారు. ప్రాచీన వాస్తు శాస్త్రంలో సింహద్వారం పెట్టే విధానం, సింహద్వారానికి ఎదురుగా ద్వారాలు పెట్టే విధానం చెప్పారు కానీ, ప్రతి గదికి ద్వారం పెట్టే విధానం ఎక్కడ ఎలా పెట్టాలి అనే విషయం గూర్చి చెప్పలేదు.

# సింహద్వారము

ప్రారంభంలో ఆధునికులు చెప్పిన ఈశాన్య ద్వారాల మీద మరియు ప్రాచీనులు చెప్పిన సెంటర్ సింహద్వారం మీద ఏది తప్పు? ఏది ఒప్పు? అని తేల్చుకోవడం కష్టం అయిన పనే. అయితే ఇంటి యొక్క వెడల్పును తొమ్మిది భాగాలుగా చేసి, అందులో 4,5,6 భాగాలలో ఎందులో అయినా సింహద్వారం ఏర్పాటు చేయవచ్చు అని ప్రాచీనులు తెలిపారు. 'గృహాయతే నంద విభాగభాజతే శరాంశకే దక్షిణ భాగమాధికం' ఇంటి నిడివిని తొమ్మిది భాగాలుగా చేసి అందులో ఐదవ భాగంలో కుడివైపు కొంచెం ఎక్కువ

వదిలి సింహద్వార్రం పెట్టమని చెప్పారు. ప్రాచీనులు ఈ విధంగా రెండే పాఠాలు తెలిపారు. నాస్తికులు అడిగే ప్రశ్న ఏమిటి అంటే... ఈశాన్యంలోనే ద్వారం పెట్టాలా? లేకపోతే ఏమౌతుంది? అసలు ఈశాన్య ద్వారం విషయం ప్రాచీనులు ఎత్తుకో లేదు. కాబట్టి మీరు ప్రాచీన వాస్తు శాస్త్రానికి దగ్గరకు రానవసరం లేదు అనుకుందాం. ఈశాన్యంలో సింహద్వారం పెట్టాలి అనే పిచ్చినానుడి ఆధునిక వాస్తు శాస్త్రజ్ఞులు లేపిన దుమారం. దీన్నే విజ్ఞాన వంతులు కూడా ప్రశ్నిస్తున్నారు. ఇవి ఆధునికులనే అడగాలి. ప్రాచీన వాస్తు దగ్గరకు మీరు రాకపోయినా, సెంటర్ సింహద్వారం విషయంలో సమాధానం చెప్పవలసిన అవసరం లేకపోయినా, మీకు కొన్ని విషయాలు చెబుతాను. చైనా వాస్తు ప్రకారం కూడా మన ప్రాచీన వాస్తు సిద్ధాంతం మాదిరిగానే సెంటర్‌లోనే సింహద్వారం ఏర్పరచాలి. చైనా వాస్తు పుస్తకాలు చదువుతున్నప్పుడు జామిలిన్, రిచర్డ్ వెబ్‌స్టర్ పుస్తకాలలో ఈ సింహద్వారం విషయంలో ఒక గొప్ప విశేషం బయట పడినది. అది ఏమిటి అంటే... ఇంటికి సింహద్వారం మధ్యలో ఉంటే తలుపు తీసి ఉన్నప్పుడు బయట అధిక వాతావరణం ప్రభావం ఇంటి లోపలకు త్వరగా రాదు అని వివరం వ్రాశారు. ఈ అంశ వివరణలోనే బాగా పొగమంచు కురిసే ప్రాంతాలలో గమనిస్తే పొగమంచు కురిసే సమయాలలో సింహద్వారం తలుపులు తీసి ఉంచితే ఈశాన్య సింహద్వారం ఉన్న ఇంటిలోకి అధికంగా అతి వేగంగా పొగమంచు చేరును. సెంటర్ సింహద్వారం ఉన్న ఇంటిలో కొంచెం తక్కువగా, నెమ్మదిగా చేరును అనే పరిశీలన ఉదాహరణగా చెబుతూ దుమ్ము, ధూళి వంటి వాటిని కూడా ఉదాహరణ చేస్తే సెంటర్ సింహద్వారం కరెక్ట్ అనే అనిపిస్తుంది. సింహద్వారం గూర్చి ప్రాచీనులు చెప్పిన విషయం బాగా ఆలోచిస్తే సైంటిఫిక్ రీజన్స్ అని కూడా అర్థం అవుతుంది. ప్రాచీనులు వసతి కోసం కొన్ని సింహద్వార నియమాలు తెలిపారు. అవి కూడా వసతిని దృష్టియందు ఉంచుకుని చేసిన నియమాలే.

సింహద్వారం ఇంటికి ఒకటే ఉంటుంది. అది ఎన్ని అంతస్తుల ఇల్లు అయినా సరే, ఎన్ని పోర్షన్ల ఇల్లు అయినా సరే.





సింహద్వారం అంటున్నాం కాబట్టి, అది అన్ని ద్వారముల కంటే పెద్దదిగా ఉండాలి.

సింహద్వారమునకు ముందర వైపు అడ్డంగా వచ్చేవి వేధలు అంటారు.

ద్వారం ఎదురుగా వీధి, వృక్షములు, బురద, యంత్రములు, బావి, స్తంభం వంటివి ఉండకూడదు. ఇలా వేధలు చెప్పడంలో ఆంతర్యం ఏ విధమైన అడ్డంకులు లేకుండా సింహద్వారం నుంచి నడకలు సాగించాలి అనే ఉద్దేశ్యమే ముఖ్యము.

ఒక వేళ ఈ వేధలు ఉంటే దానికి **'ద్వారోచ్ఛ్రాయ ద్విగుణితాంత్యక్త్వా భూమిం బహిఃస్థితిః'** అనగా ద్వారా ఎత్తు ఎంత ఉంటుందో దానికి రెండింతలు ప్రదేశం వదిలి వేయమన్నారు. ఇది మనకు సులభ మార్గం. సానుకూల నిర్మాణం కోసం చేసిన నియామాలే కదా? చెప్పండి.

## నైఋతిలో మాస్టర్ బెడ్‌రూమ్

నైఋతిలోనే మాస్టర్ బెడ్‌రూమ్ ఉంచాలా? లేకపోతే ఏమి అవుతుంది అని నాస్తిక వాదన. నైఋతిలోనే మాస్టర్ బెడ్‌రూమ్ ఉంచాలి అని ఆధునిక వాస్తు శాస్త్రజ్ఞుల వాదన. ఒకసారి శాస్త్రం ఏమి చెప్పినదో పరిశీలిద్దాం. శాస్త్రంలో యజమాని ఇంటికి ఒక మూల ఉన్న గదులలో పడుకోవద్దనే చెప్పినది. నైఋతి కూడా ఒక మూల ఉండే గదే కదా? అనగా నైఋతిలో యజమాని నిద్ర చేయకూడదన్న మాట. మరి ఈమాట ఎలా ప్రచారంలోకి వచ్చింది అంటే ఆధునిక వాస్తు శాస్త్రజ్ఞులం అని చెప్పే వారి నుండే ప్రాచీన శాస్త్రంలో ఒక విధంగా ఉంటే, అది తెలుసు కోకుండా శాస్త్రకారుడు చెప్పిన మాట తప్పా? ఒప్పా? ఇది సైన్సా? కాదా? అని మీలో మీరు కొట్టుకుంటే ఎలాగ?

మాస్టర్ బెడ్‌రూమ్ విషయంలో ప్రాచీన శాస్త్రజ్ఞులు మాత్రం సైంటిఫిక్ గానే చెప్పారు. శ్రీకృష్ణ వాస్తు శాస్త్రం ప్రకారం **'సుప్తి గృహంబు యామ్యమున'** దక్షిణ దిశలో పడక గదిని ఉండాలి అని చెప్పారు. మానసారంలోను ఇదే నియమం **'సుప్తాలయో యామ్యయోః'** అని

కాలామృతంలో మరియు విశ్వకర్మ మతంలో 'బ్రహ్మ గంధర్వ మానుష్య **భాగత్రయ విభాజితమ్ కారయేత్ మతిమాన్ శిల్పీ కల్పనార్థం పృథు క్రియమ్'** అనగా గృహమును అగ్రభాగమున అనగా ముఖ భాగం వైపు (దిక్కుతో సంబంధం లేదు) బ్రహ్మ భాగంగా పరిగణించారు. మధ్య భాగమును గంధర్వ భాగంగా పరిగణించారు. పృష్ఠ భాగము వెనుక భాగమును మనుష్య భాగంగా పరిగణించారు. **'గాంధర్వే శయ నాదికః'** అని విశ్వకర్మ మతం అనగా మధ్యభాగంలో పడకగది ఏర్పాటు చేసుకోమని తెలిపారు. మధ్య భాగము యొక్క విశేషం ఏమిటో గమనిద్దాం. నిద్రావస్థలో ఉండగా వాతావరణం యొక్క ప్రభావం మనమీద ఎక్కువగా ఉండే అవకాశం ఉన్నది. మనం నడిచేటప్పుడు పనిలో ఉండగా ఇటువంటి సమయాలలో మనం మన బుద్ధితోను, మన శారీరక బలంతోను వాతావరణ ప్రభావం నిరోధించుకునే ప్రయత్నం చేసి, కృతకృత్యులం కాగలం. అప్పుడు వాతావరణం మన మీద త్వరగా పనిచేస్తుంది. కానీ నిద్రావస్థలో మన బుద్ధి, శరీరం రెండూ కూడా పనిచేయవు. అందుకే వాతావరణం అతిగా ప్రభావితం చేయని గదులలో నిద్ర చేయమని వాస్తు శాస్త్రం చెబుతున్నది. మీరు బాగా చలిగా ఉన్న రోజులలో, బాగా వేడిగా ఉన్న రోజులలో మీ ఇళ్లలోనే ప్రత్యక్షంగా పరిశీలించండి. మూల గదులలో ఎండాకాలంలో ఉండే వేడి, మధ్యగదులలో ఉండదు. శీతాకాలంలో మూల గదులలో ఉండే చలి మధ్యగదులలో ఉండదు. అందుకే 'గాంధర్వే శయనాదికః' అని తెలిపారు. మధ్య గదికి వాతావరణ ప్రభావం తక్కువ. అందుకే మధ్యగదికి ప్రాముఖ్యం ఇచ్చారు. ఇది నేను వ్రాశాను అని మీరు ఒప్పుకోవడం, ఒప్పుకోకపోవడం వంటివి చేయకండి. మీ ఇళ్లల్లో ఎ.సి. మిషన్‌లు ఒకసంవత్సరం పాటు ఆపివేసి, ప్రత్యక్షంగా పరిశీలించండి. ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు చక్కటి సిద్ధాంతం అందించారు అని తెలుస్తుంది. ఈ ఆధునికులు నైఋతిలో మాస్టర్ బెడ్‌రూమ్ ఎందుకు చెప్పారో నాకు అయితే తెలియదు. 'ధనాగారం' కూడా రక్షణ దృష్ట్యా మధ్య గదులలో తెలిపారు. నేటి బరువు వాస్తు (ఆధునిక) శాస్త్రజ్ఞులు అతి తెలివిగా బీరువా నైఋతిలో పెట్టిస్తున్నారు. నైఋతిలో అనగా ఒక





మూల రక్షణ ఉంటుందా? మధ్యలో రక్షణ ఉంటుందా? మీరే ఆలోచించండి. దిక్పాలకుల విషయంగా కూడా నైఋతికి దిశాపతి రాక్షసుడు. మరి ఉత్తరం కదా కుబేర స్థానం. ఉత్తరంలో చెప్పకుండా నైఋతిలో చెబుతున్నారెందుకు? రాక్షస స్థానంలో ధనం ఉంచవచ్చా? ప్రాచీనులు మాత్రం 'శుభకరం భండార వేశ్మోత్తరే' అని తెలిపారు. అనగా ధన ధాన్య నిక్షేపాలు, నిల్వలు ఉత్తర దిశలలోనే అని తెలిపారు. ఇంటి మధ్య భాగంలోనే అందరికి పడక గదులు చెప్పి, ఇంటి మధ్యభాగం అయిన ఉత్తర దిశలోనే ధన ధాన్య నిల్వలు చెప్పారు. దీనిని బట్టి ఆలోచించండి. రక్షణ దృష్ట్యా ప్రాచీనులు చెప్పినది తప్పా? ప్రాచీనులు 'మేము చెప్పినది పూర్తి సైన్స్' అని చెప్పలేదు. వారు రక్షణ, అవసరం, అనుకూలం, దృష్టి యందు ఉంచుకుని ఈ శాస్త్రం తెలిపారు. పాఠకులు విజ్ఞతతో గమనించాలి.

## వంటగది

వంటగది విషయం కూడా ఇదే రీతిలో నిర్ణయం జరిగింది. ఆగ్నేయంలో వంటగది నిర్మాణం చేయమని చెప్పారు. ఇదేమయినా సైంటిఫిక్ రీజనా? అని అడక్కండి. ఇలా అడిగే ప్రశ్నకు ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు అవకాశం ఇవ్వలేదు. వారు మనకంటే తెలివి గలవారు. ఇంటికి వెనుక గదులలో వంట ఏర్పాటు చేయమని చెప్పారు. అలాగ చెప్పడం వలన తూర్పు సింహద్వారం ఇంటికి నైఋతి గదిలోను, దక్షిణ సింహ ద్వారం ఇంటికి ఈశాన్యగదిలోను పశ్చిమ, ఉత్తర దిశల సింహద్వారం గృహములకు ఆగ్నేయంలోను చెప్పారు. అంటే ఒక చోట మాత్రమే చెప్పలేదు. మరి ఈ నేపథ్యంలో వారు మన సౌలభ్యం చూశారా? లేదా? ఆడవారికి ఇంటికి వెనుకభాగంలో వంటగదులు ఏర్పాటు చేస్తే, వారు ఎంతగా సుఖంగా వంటకార్యం పూర్తి చేసుకోవచ్చు. మరొక విషయం... నేటి ఎలక్ట్రానిక్ యుగాన్ని దృష్టిలో ఉంచుకోకండి. పూర్వం మిక్సీ, గ్రైండర్లు లేని రోజుల్లో చెప్పిన శాస్త్రం ఈ వాస్తు శాస్త్రం. కాబట్టి పొయ్యి దగ్గర్లోను, రోలు దగ్గర్లోను వివిధ విషయాలు వివిధ భంగిమలలో ఉండి, వంట

కార్యం చేయవలసి వచ్చినప్పుడు అక్కడే మగవారు, పరాయివారు తిరుగుతూ ఉంటే, ఎంత చికాకుగా ఉంటుంది. అందుకనే వెనుక భాగంలో వంట, ముందు భాగంలో పురుషుల కార్యాలు చెప్పారు. తూర్పు ముఖంగా కానీ, పడమర ముఖంగా కానీ వంట చేయమన్నారు. ఈశాన్య, ఆగ్నేయ గదులలో తూర్పు ముఖంగా అంటే తూర్పువైపు సూర్యరశ్మి ప్రాతఃకాలం ఎక్కువగా ఉండే అవకాశం వలన వెలుతురుకు ఇబ్బంది ఉండదు. నైఋతి గదిలో పడమర దిశలో ఉండి వంట చేయడం వలన వెంటిలేషన్ ప్రాబ్లమ్ ఉండదు. అందువలన వంటకు ఆ విధానం ఏర్పాటు చేశారు.

## వీధి శూల

ఇందులో నేడు మనం వింటున్న వాస్తు శాస్త్ర విషయములు అన్నీ ప్రాచీనులు చెప్పలేదు. మహర్షులు చెప్పినది రోడ్ ఎదురుగా ఇళ్లు కట్టవద్దని మాత్రం చెప్పారు. మన గృహమునకు ఎదురుగా వీధి వస్తే అది తప్పు. సింహద్వార వేధలు తెలుపుతూ రథ్యావేధ అని ఒక విషయం తెలిపారు. అయితే దీనికి దోష పరిహారం కూడా తెలిపారు. అది ఏమనగా **'ద్వారోచ్ఛ్రాయ ద్విగుణితం త్యక్త్వా భూమిం బహిఃస్థితిః'** అనగా సింహ ద్వారం ఎంత ఉంటుందో దానికి రెండింతల దూరం వరకు ఖాళీ స్థలం వదిలి వేస్తే ఆ దోషం పోతుంది. ఈ వీధి శూల విషయం పూర్తిగా సాంఘీక దృష్ట్యా ఏర్పాటు చేసినది అనుటలో సందేహం లేదు. మార్గం అంటే నిర్వచనం చూద్దాం.

యస్మిన్మార్గే జనాస్సర్వే మృతాయాంతి పితృక్షయమ్
మార్గస్సఏవ విజ్ఞేయ శేషాదేశాంతరం ప్రతి

ప్రతి దానిని మార్గం అనలేదు. దానికొక కొలత, కనీస కొలత ఏర్పరచారు. మరణించిన వారిని జనులు శ్మశానమునకు తీసుకు పోవుటకు వీలుగా స్వేచ్ఛగా ఉండే దారినే మార్గము అంటారు. ఇదే రీతిగా ఉన్న దారి ఏదైతే దేశాంతరములకు పోవుటకు ఉపకరించునో దానిని దేశాంతర మార్గం అంటారు. మరొక వీధి శూల మాదిరి చూద్దాం.








పటంలో చూపిన విధంగా రాజవీధి ఏదైనా ఒక చోట రెండుగా చీలి, వేరే రాజవీధిలో కలిస్తే, ఆ మధ్యలో ఉండే స్థలమును నారాచ స్థలము అంటారు.

ఇటువంటి స్థలమును నివాసానర్హ స్థలంగా పరిగణించారు. దానికి నారాచస్థలం అని పేరు పెట్టారు. పక్కన స్థలంలో రాజవీధి (1) రెండుగా చీలి, రాజవీధి (2)లో రెండు చోట్ల కలిసినది. ఆ మధ్య త్రికోణాకారంగా ఏర్పడిన స్థలమే నారాచస్థలము. ఇలాంటి స్థలంలో సాధారణంగా ఎవరూ నివాసం ఉండడానికి ప్రయత్నించరు. రక్షణ, అశాంతి ఉండే స్థలం అది. దీనిలో అయినా వీధిశూల అయినా అర్థం ఏమిటి అంటే రోడ్డుకు అడ్డంగా ఇల్లు కట్టి, గ్రామ, నగర రచనా కార్యంలో అడ్డం రాకుండా ఉంటారు అని. రోడ్డుకు అడ్డంగా ఇల్లు కడితే మరి పారిశుద్ధ్యం వంటి వాటి విషయంలో కూడా చికాకు ఉంటుంది.

| | | | |
|---|---|---|---|
| రాజవీధి | | | స్థలం (1) |
| స్థలం (4) | స్థలం (3) | స్థలం (2) | |

దీనిలో స్థలం (1) వాడు రాజవీధికి అడ్డంగా ఇల్లు కట్టాడు. తత్ఫలితంగా స్థలం (2,3,4)ల వారికి కేవలం ఒకవైపు మాత్రమే ప్రయాణం చేయవలసి ఉంటుంది. పారిశుద్ధ్యం విషయంలో కూడా చికాకు వస్తుంది. గ్రామ రచన విధానాలలో రాజవీధి యొక్క విషయం రెండు వైపులకు ప్రయాణం చేయవలసి వచ్చేలాగా గ్రామ రచన తెలిపారు. ఎవరైనా స్థలం (1) వారిలాగా రోడ్‌కు అడ్డంగా నిర్మాణం చేస్తారేమో అనే అనుమానంతోను స్థలం (2,3,4) వారు రెండు వైపులకు ప్రయాణం చేసే సౌకర్యం పాడు అవుతుందేమో అనే విషయం కోసం ఈ వీధిశూల

ఏర్పాటు చేశారు. ఉదాహరణకు స్థలం రెండు వాటి ఇంట ఏదైనా వివాహం, అదే సమయంలో స్థలం నాలుగు వాటి ఇంట ఏదేని చావు ఒకేసారి సంబవిస్తే స్థలం 2 వాడు, స్థలం 4 వాడి ఇంటి మీదగానే వాడి స్థలంకు చేరాలి. శుభకార్యం జరుగుతున్న ఆ స్థలం (2) వాడు సైకలాజికల్‌గా ఇబ్బంది పడే అవకాశం ఉన్నది. మీరు అవునన్నా, కాదన్నా ఇది ఖచ్చితమే. అదే స్థలం (1) వాడు రోడ్‌కు అడ్డంగా ఇల్లుకట్టకుండా ఉంటే వాడు స్థలం (4) వైపుగా కాకుండా వేరొకవైపు ప్రయాణం చేసే అవకాశం ఉన్నది. ఇంతకు మించి ప్రాచీన శాస్త్రం వారు వీధి శూలల గూర్చి చెప్పలేదు. ద్వారం ఎత్తు కనీసం 6 1/2 ఉంటుంది. దానికి రెండింతటు అంటే 13 అడుగుల స్థలం వదిలి గృహ నిర్మాణం చేయమన్నారు కదా! అంటే అది కూడా గ్రామాల చివర్లో ఉండే ప్రాంతాలలోనే. అంతే కానీ గ్రామ మధ్య రోడ్లలో కాదు అని గమనించండి.

## కుల ప్రాతిపదికలో స్థల వర్గీకరణ తప్పా? ఒప్పా?

సృష్టి ఆరంభం నుంచి చివర వరకు ఈ వర్గీకరణ ఉంటూనే ఉన్నది. దీన్ని ఆపడం ఎవరి వల్లా కాదు. బయటకు వచ్చి అక్కర్లేని వాదనలు, కబుర్లు చెప్పమంటే చెబుతారు కానీ ప్రపంచం మొత్తం జాతి వివక్ష నడుస్తూనే ఉంటుంది. అమెరికాలో వైట్స్ బ్లాక్స్ మధ్య, సరే అరబ్ దేశాలలో అనేక తెగలు, అలాగే భారతదేశంలోనూ వర్ణములు ఉన్నవి. మనవారు సంఘ సంస్కర్తలం అని ముందుకు వచ్చేవారు కూడా మానసికంగా లోపల ఫీలింగ్ ఉన్నా అది బయట పెట్టరు. ఎందుకంటే కేవలం సమాజం కోసమే చేస్తారు. బాగా ఆలోచించండి... ఒక కోటి రూపాయల బిల్డింగ్ వాంబే కాలనీల వంటి కాలనీల మధ్య కట్టుకోవడానికి ఎవరూ ఇప్పటి దాకా ప్రయత్నించలేదే? బయట ఉపన్యాసాలు మాత్రం దంచుతారు. సందర్భం కాకపోయినా సమాజంలో జరిగే పొరపాట్లు మీకు కొన్ని ఉదాహరణలు చూపుతాను.

1. ప్రపంచం మొత్తంలో పిల్లలు పుట్టిన దగ్గర నుండి కొంత వయస్సు వరకు తల్లి పోషణలోనే ఉంటారు. తల్లే పిల్లలకు వంట, వడ్డన





చూసుకోడానికి కూడా ప్రయత్నిస్తుంటుంది. కనీసం పిల్లవాడికి మూడవ సంవత్సరం వచ్చే వరకు అయినా. కానీ మహిళ మాత్రం మేము వంటింటి కుందేళ్ళమా? అని వాదించే ఘటన నిత్యం వినబడుతూనే ఉంటుంది. **'యధామాతరమ్ ఆశ్రిత్య సర్వేజీవంతి జంతవః'** ఇది తల్లిగా ఉండే ఆడదానికి తప్పదు. సృష్టిలో ప్రారంభం అయిన ప్రేమ మరి.., పిల్లవాడికి పాలు తల్లి కాకపోతే తండ్రి ఇస్తాడా? అక్కడినుండి బాధ్యతగా ప్రారంభమౌతుంది.

2. ఆంధ్రాలో ఆడవారికి భర్తపోయిన తర్వాత బొట్టు, పూలు తీసివేసే అలవాటు ఉన్నది. భర్తపోయిన స్త్రీని విధవగా సంబోధిస్తారు. అయితే నేటి సమాజంలో విధవ అయినంత మాత్రాన బొట్టు, పూలు ఎందుకు విడనాడాలి అని గొడవ చేసే మహిళలు ఎక్కువ అయ్యారు. అలా వాదించే మహిళలు ఆ విధవను బొట్టు పెట్టి తమ ఇంటిలో జరిగే వరలక్ష్మీ వ్రతం, సౌభాగ్య లక్ష్మీ వ్రతం లాంటి వాటికి పిలవరు. వారికి మనసులో మాత్రం భయం ఉంటుంది. బయట చర్చావేదికలు నిర్వహిస్తారు. వారింటికి మాత్రం ముత్తైదువగా పిలిచే విషయంలో మాత్రం వ్యతిరేక భావనతోనే ఉంటారు. 'ఎవరి దాకా వస్తే కానీ వారికి తెలియదు' అని ముతక సామెత ఉన్నది లెండి. ఇదే రీతిన ఈ కుల వివక్ష కూడా సృష్ట్యారంభం నుంచి సృష్ట్యాంతం వరకు ఉన్నది. పూర్వం కులమును బట్టి వృత్తులు ఉండేవి.

నా వాస్తుసుధ 48వ పేజీ నుండి చూడండి. బ్రాహ్మణాది వర్ణములను గూర్చి స్థల విభాగములు చేయుట అందరూ జీర్ణించుకోలేని విషయం ప్రాచీన వాస్తుని విమర్శించే స్థితి ఏర్పడినది. పూర్వం కులాచారం ప్రకారం కులవృత్తులు నడుపుతూ జీవనం సాగించే వారు. బ్రాహ్మణులు యజ్ఞ యాగాది క్రతువులు చేయడం, క్షత్రియులు పరిపాలన, వైశ్యులు వ్యాపారం చేయడం, శూద్రులు వ్యవసాయం దానికి సమానమైన వృత్తులు చేసేవారు. భగవద్గీతలో కృష్ణపరమాత్మ **'స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః'** అని తెలిపారు. అదే పాటించి ప్రజలు కూడా సుఖపడ్డారు. అయితే ఒకసారి గమనించండి. క్షత్రియులు ప్రభుత్వ రంగంలో పరిపాలనా విషయాలు పరిశీలించేటప్పుడు అంతా ఒకచోట ఉన్నారు అనుకుందాం.

దీని వలన ఎంత లాభం. ఎవరికైనా పరిపాలనా విషయంలో అవసరమైతే ఆ క్షత్రియ గృహ సముదాయం దగ్గరకు వెడితే తేలికగా పనులు పూర్తి చేసుకునే అవకాశం ఉంటుంది. పరిపాలనా రంగంలో ఉన్నవారు అందరూ ఒకచోట ఉన్న కారణంగా ఈ సౌకర్యం కలుగుతుంది. అదేవిధంగా ఏదేని వస్తువు కొనుక్కోవడం కోసం వైశ్య గృహ సముదాయం దగ్గరకు వెడితే ఒకవేళ ఒక షాపులో దొరక్కపోయినా మరొక షాపులో దొరుకుతుంది. షాపులన్నీ పక్కపక్కనే ఉంటాయి కాబట్టి. వస్తువు కొనుక్కునే వాడికి కూడా తేలిక అవుతుంది. అందుకే ఈ వర్గీకరణ చేశారు. పూర్వం శూద్రులు అందరూ వ్యవసాయం వంటి కార్యముల మీద మాత్రమే ఉండేవారు. కృషి కర్మలకు పనులు చేయువారు కావలసి వస్తే, శూద్ర గృహ సముదాయం దగ్గరకు వెడితే తేలికగా దొరికే అవకాశం ఉన్నది. అందుకే నాడు అలా చేశారు. మరి నేటి ప్రబుద్ధులు మార్కెట్ యార్డులు ఎందుకు కడుతున్నారు? ప్రస్తుతం పప్పుల మార్కెట్ పేర విజయవాడలో కూడా పెద్ద సెన్సేషన్ జరుగుతోంది. దాంట్లో వ్యాపారులు అందరూ ఒక చోట ఉంటారు. పూర్వం కులాన్ని బట్టి వృత్తి. అందుకే కులాన్ని బట్టి వర్గీకరణ. నేడు కులంతో సంబంధం లేకుండా వృత్తి. అందుకే వృత్తిని బట్టి వర్గీకరణ జరుగుతూ ఉంటుంది. ఏదైనా కంపెనీకి కాలనీలు నిర్మాణం చేస్తే అందులో 'ఎ' గ్రేడ్, 'బి' గ్రేడ్ లేబర్ వర్గీకరణతో నిర్మాణాలు జరుగుతుంటాయి. మరి ఎ గ్రేడ్ ఆఫీసర్ క్వార్టర్స్ పక్కన లేబర్ కాలనీలు ఎందుకు కట్టరు? ప్రస్తుత సమాజంలో ఎప్పుడు లేబర్ కాలనీలు ప్రకటించినా, భూమి పంపిణీ చేసినా ఊరు చివర్లోనే జరుగుతుంది. క్రమంగా ఊరు పెరిగి లేబర్ కాలనీ చుట్టూ గ్రామం, నగరం పెరగవచ్చేమో? కానీ ప్రభుత్వం కూడా వారికి ఊరికి దూరంగానే స్థలాలు ఏర్పాటు చేస్తుంది? కాబట్టి మన పూర్వీకులు ఏదో తప్పు చేసినట్లు చెబుతూ అదే పని మీరు కూడా చేస్తున్నారు కాబట్టి వెధవ ఫీలింగ్స్ పెట్టకుండా మీ పని మీరు చేసుకుంటే చాలా ఉత్తమం. సంఘం కూడా బాగుపడుతుంది.





## చైనా వాస్తునకు మన ప్రాచీన వాస్తునకు ఉన్న సామ్యత

మన ప్రాచీనులు చెప్పినదే చైనా వాస్తు శాస్త్రజ్ఞులు కూడా తెలిపారు. ఇవి సంస్కృతితోను, సంస్కారంతోను కూడినది.

1. ఇంటిలోనికి రాగానే వంట కనబడకూడదు. వంటగది వెనుక భాగంలో ఉండాలి.
2. సింహద్వారమునకు ఎదురుగా లెట్రిన్, బాత్‌రూమ్‌లు రాకూడదు.
3. సింహద్వారము నుండి లోపలకు రాగానే పడక సామాగ్రి, భోజన సామాగ్రి, వంట సామాగ్రి కనబడకూడదు.
4. ఇంటి లోపల లెట్రిన్, బాత్‌రూమ్‌లు సామాజిక రక్షణ దృష్ట్యా తప్పులేదు.
5. నిద్ర లేవగానే పొయ్యి, డైనింగ్ టేబుల్, భోజన సామాగ్రి చూడకూడదు.
6. ఏకాశీతి పద వాస్తు ప్రకారం మనవారు ఇంటి చుట్టూ 1/9 వంతు ఖాళీ చెప్పారు. చైనా వారు ఇంటి లోపలకు వీలైనంత గాలి, వెలుతురు వచ్చేలాగా ఖాళీలు వదలమని చెప్పారు.
7. బెడ్ రూమ్‌లు ద్వారానికి కొంచెం దూరంగా ఉండాలి.
8. గాలి, వెలుతురు ప్రసరించేలాగా ప్రతి గది నిర్మాణం చేయాలి. అతి పెద్ద గదులు విసర్జించారు.
9. బరువులు పెట్టే ప్రదేశాలు, ఉచ్చ, నీచ స్థానాలు అనేవి మన ప్రాచీనులు మరియు చైనావారు ఇరువురు కూడా నిషేధించారు.

చైనా వాస్తు గూర్చి ఇక్కడ ఎందుకు స్పృశించాను అంటే ఈ మధ్యన చైనా వాస్తు కూడా బాగా ప్రాచుర్యంలోకి వచ్చినది కదా. అందులో సంస్కారయుక్తమైన విషయములు మరియు మన ప్రాచీనులు చెప్పినవి ఒకటేగా ఉంటే వ్రాసాను.

## గ్రహాలు 9-12-8 ఇంతకూ ఎన్ని?

వేదంలో చెప్పబడిన విజ్ఞానమే శాస్త్రముల రూపంలో మనకు అందింపబడుతాయి. వేదం తొమ్మిది గ్రహములను మాత్రమే సూచించినది. అందువలన తొమ్మిది గ్రహములను మాత్రమే జ్యోతిష శాస్త్రం

చెప్పినది. సాంప్రదాయ బద్ధంగా మన శాస్త్ర చర్చ ఎప్పుడూ తొమ్మిది గ్రహములను ఆధారం చేసుకుని మాత్రమే ఉంటుంది.

ఈ మధ్య విజ్ఞాన శాస్త్రంలో మరొక మూడు గ్రహాలు ఉన్నాయి అని చర్చ పెరిగింది. ఈ విషయంలో మీడియా పెద్ద హడావిడి చేసింది. 12 గ్రహాలు అని గొడవ జరుగుతూ ఉండగానే గ్రహాలు ఎనిమిది మాత్రమే ఉన్నాయి అని మరొక విషయం చర్చకు వచ్చినది. ఇంతకీ గ్రహములు తొమ్మిదా? పన్నెండా? ఎనిమిదా? అంటే....

ఎనిమిది గ్రహములు రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని, రాహు, జ్యోతిష శాస్త్ర రీత్యా రాహువునే రాహు కేతువులుగా సూచించడం జరుగుతుంది. మనకు ఈ విషయంలో ఒక పురాణ గాధ కూడా ఉన్నది.క్షీర సాగర మధనం విషయంలో శ్రీమన్నారాయణుడు రాహువును రెండుగా చేసిన గాధ. అందువలన 9 గ్రహాల విషయంలో అనుమానం లేదు. ఉన్న అనుమానం మిగిలిన మూడు గ్రహాలను గూర్చి మనం ముందుగా విజ్ఞాన శాస్త్రం పాఠాలు పరిశీలిద్దాం. మనకు సౌర కుటుంబంలో తొమ్మిది గ్రహాలు ఉన్నాయి. అవి వాటి కక్ష్యలలో సంచరించు సమయాలను గణన చేసి అవి మనకు అవరోధం రాకుండా మన శాస్త్రవేత్తలు అంతరిక్ష నౌకలు అంతరిక్షంలోకి పంపుతారు అని చెబుతారు.

మరి ఇన్ని విషయాల పరిశీలనలో మీరు చేసే అంతరిక్ష ప్రయాణాల విషయంలో ఎప్పుడూ ఈ గ్రహాలు అడ్డురాలేదా? రాలేదుగా. జ్యోతిషం ఊహ. సైన్స్ యదార్థం. భౌతికం అని సైంటిస్టులు అంటున్నారు. బాగానే ఉన్నది. మరి వంద సంవత్సరాల పై నుండి చేయుచున్న అంతరిక్ష పరిశోధనలో అడ్డురాని ఆ మూడు గ్రహాలు సైంటిస్ట్‌లకు జ్యోతిష శాస్త్ర వేత్తలకు కూడా 2006 ఆగష్టు వరకు అక్కర్లేని గ్రహాలేగా? అవి ఇప్పటి దాకా విజ్ఞాన శాస్త్రంలో జ్యోతిష శాస్త్రంలో ప్రభావం చూపించలేకపోయినాయి. ఇప్పుడు మాత్రం ప్రభావం చూపుతాయి అని నమ్మకం ఏమిటి? వంద సంవత్సరాలకు పైగా శోధించగా బయటపడిన గ్రహాలు అవి. అంటే వాటికి మిగిలిన గ్రహాలతో సమమయిన స్థానం మరియు భూమికి గ్రహ ప్రభావాలు ఏమిటి అని శోధించే విషయంగా మనకు ఇన్నాళ్లు





ఉపయోగించని ఆ మూడు గ్రహాలు ఇక్కడ నుండి మన పరిశోధనల మీద ప్రభావం చూపుతాయా? లేదా అని సైంటిస్ట్‌లే పూర్తి అవగాహన లేని వారయినప్పుడు ఆ గ్రహాలను గూర్చి జ్యోతిష శాస్త్రంలో ముడిపెట్టి చర్చ ఎందుకు చేయాలి?

మన సృష్టిలో అనేక రకాలైన విజ్ఞానం ఉన్నది. సౌర కుటుంబంలో ఎన్నో విశేషాలు ఉన్నాయి. పరాశర మహర్షి తొమ్మిది గ్రహాలతో పాటు తొమ్మిది ఉపగ్రహాలు కూడా చేర్చారు. సైన్స్ బాగా అభివృద్ధి చెందని రోజులలోనే సాధనాలు సరిగాలేని రోజులలోనే చెప్పబడినది తొమ్మిది గ్రహాలు. సైంటిస్టులు సాధన, సంపత్తి పెంచుకుని కూడా ఇప్పటికీ ఉపయోగం ఏమిటో తెలియని మూడు గ్రహాలను మాత్రమే కనుగొన్నారు. వీటితో ఉపయోగాలు లేవు కాబట్టే మహర్షులు వాటిని స్పృశించలేదు. అవసరం ఉన్నంత వరకే చెప్పేవారు మహర్షులు. అందుకే జ్యోతిష శాస్త్రంలో ఫలితాలను చూపించే తొమ్మిది గ్రహాలను గురించి మాత్రమే చర్చించారు. సైంటిస్ట్‌లు కూడా ఇప్పటి వరకు ఆ తొమ్మిది గ్రహాలను మాత్రమే శోధించగలిగారు. ఇప్పుడు కనుగొన్న ఆ మూడు గ్రహాల నడవడికను వారు కూడా వివరించలేదు కదా?

జ్యోతిష శాస్త్రంలో 'భ' చక్రంలో అతి వేగంగా తిరుగాడు చంద్రుడు నుండి అతి మందంగా సంచరించే శని వరకు మాత్రమే గణించి ఫలితాలు ఇవ్వడం జరుగుతుంది.. అందుకే మిగిలిన ఉపగ్రహాలకు 'భ' చక్రంలో స్థానం లేదు.

**అందరూ గమనించండి. వైద్యుడు చేసిన పొరపాటుకు వైద్యశాస్త్రమే తప్పు అని అనకూడదు. అలాగే వైద్య శాస్త్రం ఎవరో కనుగొనగా ప్రస్తుతం డాక్టర్లు ఆ శాస్త్రాన్ని ఆపరేట్ చేస్తున్నారు.**

ఇదే రీతిగా జ్యోతిషం చెప్పే శాస్త్రి పొరబాటు పడిన దానికి జ్యోతిష శాస్త్రం తప్పు అనకూడదు. జ్యోతిష్కులు కూడా జ్యోతిష శాస్త్రం యొక్క ఆపరేటర్స్ మాత్రమే. అయితే కాలంలో వస్తున్న మార్పులను దృష్టిలో ఉంచుకుని కొత్త విషయాలు పరిశోధన చేయువారు జ్యోతిష శాస్త్రవేత్తలు అవుతారు.

# చివరి మాట

సివిల్ ఇంజనీర్లు ప్రాచీన వాస్తు నేర్చుకుంటే వారికి ఎక్కడా అడ్డు ఉండదు. చాలా మోడల్ హౌసెస్ కట్టవచ్చు. ప్రాచీన వాస్తులో పరిశోధన చేయండి. ప్రాచీన గ్రంథాలు పరిశీలించండి. అందులో గ్రామ రచన గూర్చి ముందుగా చదవండి. అప్పుడు మీకు ప్రాచీన వాస్తుమీద అవగాహన, గౌరవం పెరుగుతుంది.

మోడరన్ ఆర్కిటెక్ట్సుకు ఈ ప్రాచీన వాస్తు శాస్త్రం బాగా సహకరిస్తుంది. ఇకపై నేను వాస్తు సైన్సా? కాదా? అనే విషయం ఎవరు అడిగినా సమాధానం చెప్పదల్చుకోలేదు. వాస్తు శాస్త్రం మాత్రమే చెబుతాను. కావాలనుకుంటే రండి కానీ, వాస్తు శాస్త్ర అభిమానులు మాత్రం ప్రాచీన వాస్తు శాస్త్రం మీద పరిశోధన చేయమని నా కోరిక.

భవదీయుడు

**కప్పగన్తు సుబ్బరామ సోమయాజులు**

శ్రీ లక్ష్మీనృసింహార్పణమస్తు